భగ్వాన్ కవితల పుస్తకం (92-96)

# వడ్లబండి


| | |
|---|---|
| కవర్ ముద్రణ<br>మహేశ్వరం ఆఫ్‌సెట్ ప్రింటర్స్<br>రాజమండ్రి | పుస్తకం ముద్రణ<br>వంశీ గ్రాఫిక్స్<br>పాలకొల్లు |
| ప్రచురణ<br>జనవరి 1997<br>1000 ప్రతులు | ఫోటో<br>సిహెచ్ వి రామారావు<br>మల్లవరం |
| కవి చిరునామా<br>ఎ పి యస్ భగవాన్<br>లంకలకోడేరు<br>534 250<br>పాలకొల్లు మండలం<br>ప॥గో॥ జిల్లా | ప్రతులకు<br>నవోదయ బుక్ హౌస్<br>3-3-865<br>ఆర్యసమాజ్ మందిర్ ఎదురుగా<br>కాచిగూడ<br>హైదరాబాద్ - 500 027 |

వెల
16 రూపాయలు

# వడ్లబండి చక్రాల ఆకులు



నిన్న శబ్దాల్ని ప్రేమిస్తూ - నేడు వడ్లబండి

# అమ్మంటే అంతేనేమో ... !

ఇల్లూ వాకిలీ మంచమూ కంచమూ అన్నీ అరుగే ఐన
ముసలితల్లి మీ కెక్కడైనా కనిపించిందా
ఆమె గుండెకోత చప్పుడు మీ కెప్పుడైనా వినిపించిందా
ఇది సినిమా కాదు కథా కాదు
గుండెను పిండే యదార్థ దృశ్యం
ముద్దులిచ్చినందుకూ
మమతల కౌగిళ్ళిచ్చినందుకూ
దిగులులేని జీవితాన్నిచ్చినందుకూ
హోదానిచ్చినందుకూ
తల్లిని దోషిని చేసి
స్వంత ఇంటి అరుగునే చెరసాల చేసి
నలుగురి నోళ్ళనుంచీ కళ్ళనుంచీ కురిసే
సానుభూతి వాక్యాల శిక్ష వేసి
కన్నకొడుకు కసాయివాడయ్యాడు - అయినా
ఆమె పెదవి శిఖరం మీద
చిరునవ్వు జెండా అవనతం కాదు
అమ్మ కదా మరి
ఆమె మాటల్నీ చూపుల్నీ కదలికల్నీ
ముసలి వాసన చేసి
స్వజనులందరిలోనూ ఒంటరిని చేసి
జీవచ్ఛవాన్ని చేసి
కన్నకొడుకు కృతఘ్నుతా కురూపయ్యాడు - అయినా
ఆమె ఎదలో వాడి బొమ్మ అందం చెరగదు
అమ్మ కదా మరి ..... .

ఆమె నొక్కసారి కదిపితే చాలు
మాతృత్వపు వాత్సల్యం జలజలా రాలుతుంది
ఆమె ఆశీర్వచనపు పక్షి
కొడుకు భుజం మీదే వాలుతుంది
వెన్నెల గూడల్లుతూ ఆమె
కొడుకు చుట్టూరా పరిభ్రమిస్తుంది
అంత నిరాత్రిలో కూడా
ఇంటికింకా రాని
కొడుకు గురించే బెంగ వ్రతం పడుతుంటు
అరుగు శిలువ నెక్కి కూడా
పరాయి నోళ్ళనుండి కొడుకును కాపాడుతుంటు
రోజుకొక్కసారైనా
మెట్లు దిగేటప్పుడో ఎక్కేటప్పుడో
కొడుకు కళ్ళబడ్డాడన్న తృప్తి చాలు
ఆమె కళ్ళు చెమ్మగిల్లుతాయి
అమ్మంటే అంతేనేమో
బహుశా తల్లికి తప్ప
ఇంకెవరికీ ఇది సాధ్యం కాదేమో

# అంకెల పడవలెక్కి ......!

భగ్వాన్
వడ్లబండి



ఊదగా ఊదగా బుడగ బతుకేమిటో తెలిసి కూడా
నువ్వంతే
నుదుటి చెమటను చూపుడు వ్రేలితో
తుడిచి విసిరేసినట్టుగా తేలిక్కాదు
కన్ను జారాకా కలల వ్యాధి నుంచి తేరుకోవడం -
బుట్టలో పడ్డ చేప ఇక చెరువుకు చేరదు
అది ఎట్రాక్షన్ ఊబి
డ్రాసిరాపై వాలిన కీటకం ఇక జన్మకు ఎగరదు
అది ధృతరాష్ట్ర కౌగిలి . .
ఈస్ట్మన్ కలర్లో ఆశల్ని కొనుక్కుంటూ
పండగలకీ పబ్బాలకీ కలల కోటా
రెట్లు రెట్లుగా పెంచుకుంటూ
కొన్ని బలహీన క్షణాల ముందు వివస్త్రవవుతావు
ఒకే ఒక్క రూపాయి పేరంజితో
లక్ష రూపాయల మార్ఫియాను నరాల్లోకి గుచ్చుకుని
రెప్పల మాటున విస్తరించుకున్న కలల కల్లోల నదిలో
అంకెల పడవలెక్కి
బెర్ముడ ట్రయాంగిల్ వంక రొప్పుతావు
చెబుతున్నది సందేశమూ కాదు సూక్తీ కాదు
ఒక వాస్తవ జీవన విశ్లేషణ
ఒకటికీ లక్షకీ మధ్య నీ గుండె చేసిన
డోలనాల సంఖ్యను లెక్కించగలవా
రంగు రంగుల కాగితాల్లోంచి హంగులన్నీ తెంపుకొచ్చి
వాకిలి ముందు నువ్వు దిద్దిన రంగవల్లికల
చుట్టు కొలతలు కొలవగలవా .

కనురెప్పలూ కునుకూ సజాతి ధృవాలైపోయి
రాత్రుల్లో నువ్వనుభవించిన మానసిక
ఒత్తిడిని నిర్వచించగలవా
ఒకే ఒక అంకో ఒకే ఒక అక్షరమో
నీ ఆశ మీద పిడిగుద్దులు విసిరినప్పుడు
కళ్ళ వెనుక కదిలిన నీటి ఉష్ణోగ్రత
విలువను వివరించగలవా
సరదా అంచెలంచెలుగా అలవాటై వ్యసనమై
గొంగళి కొరికిన పత్రంలా బతుక్కైన్ని
రంధ్రాలో ఆలోచించగలవా
ప్రయాణం చేసీ చేసీ వెనక్కి తిరిగి చూస్తే
ఒక జీవితకాలం వెనకబడి ఉన్నట్టు గమనించగలవా
ఇవాళనీ రేపనీ నిండా మునిగాకా చలేమిటనీ
నీకు, నువ్వే శిక్షా స్మృతిని లిఖించుకుంటావు
నీకు, నువ్వే కారాగారాన్ని నిర్మించుకుంటావు
అటు సంఘంలోనూ ఇటు సంసారంలోనూ చివరకు
నీ నవ్వులు చెల్లని సత్తురూపాయిలా ధ్వనిస్తాయి
కలల్ని అమ్మడమే గానీ
కన్నీళ్ళని తుడవడం తన డ్యూటీ కాదనే వాడు
నీ అనుభూతి కేంద్రాలన్నింటి మీదా భవంతులు కట్టుకుని
నీ చెమట చలువను
కట్టెలుగా పేర్చుకుని కులుకుతుంటాడు
నువ్వు మాత్రం
ఖాళీ కళ్ళతో ఖాళీ గొంతుతో ఖాళీ గుండెతో -

# మళ్ళీ మృగత్వం లోకేనా... !

ఏ చిరునవ్వు వెనుక
ఏ చిచ్చు ఉందో కనిపెట్టగలవా
ఏ ఆలింగనం లోంచి
ఏ అస్త్రం పొడుచుకొస్తుందో చెప్పగలవా
ముఖం మీదేమీ రాసుండదు
వాడు రాక్షసుడని ఏ ఒక్క ఆనమాలూ పట్టివ్వదు
పక్కవాణ్ణి నమ్మడం
ఓ పెద్ద ప్రశ్నగా అవతరించింది
ఇప్పుడు చెప్పండి .
మనం బతికే ఉంటామనడానికి దాఖలాలేమైనా ఉన్నాయా
డబ్బూ రాజకీయమూ అధికారమూ అహంకారమూ
మతమూ మాత్సర్యమూ కులమూ కుతంత్రమూ
ఈ టెర్రరిస్టుల హిట్‌లిస్టులో
మొదటి పేరెప్పుడూ మనిషిదే
ఉదయాల్నీ వసంతాల్నీ చిదిమేసే
కిరాయి పురుగుల కాలంలో ఉన్నాం . . .
విలువల్నీ విశ్వాసాల్నీ ఒక్క అగ్గిపుల్లతో తగలేసే
కర్కశ మూకల లోకంలో ఉన్నాం . .
ధ్వనులు లేని హృదయాలూ
హృదయాలు లేని శరీరాలూ
శరీరాలు లేని నీలి వార్తలూ
జీవితాల్ని ఎన్‌కౌంటర్ చేస్తున్నాయి
మైత్రీ కీరాల రెక్కలు రాలుతున్నాయి
సహనాలూ సంప్రదాయాలూ ఆశయాలూ ఆనందాలూ అన్నీ

బూడిద నుష్పల సంస్కృతులుగా పొగలు చిమ్ముతున్నాయి
పగలు ఉరుముతున్నాయి
నగరం నదిబొడ్డు మీద
నాగరికత దినమొలతో గంతులేస్తోంది
గ్రామం గుండెలో చావు కబురు
కమురు కంపు కొడుతోంది
ఇప్పుడు చెప్పండి
మనం బతికే ఉంటామనడానికి సాక్ష్యాలేమైనా దొరికాయా
నవ్వకు
నవ్వినప్పుడల్లా నువ్వో నేరస్తుడివి
మాట్లాడకు
మాట్లాడినప్పుడల్లా నువ్వే హంతుడివి
ప్రయాణం ఎటు చేసినా ఒకటె
చీలిన దారులన్నీ
విధ్వంసం కూడలిలోనే ఏకమవుతున్నాయి
ఇప్పుడు మనిషంటే మృత్యువురా బాబూ
బోగీడు మనుషులూ బస్సుడు బతుకులూ
నిలువునా నిద్రలోనే
కాలిన మాంసం ముద్దలైపోయాకా
మనిషి ఖచ్చితంగా మృగమే అని చెప్పడానికి
ఇంకా ఆధారాలు కావాలా
ఈ ఆధునిక భగవద్గీతలో చంపేవాడూ చచ్చేవాడూ మనిషే

# మంచుపండు



ఒక్కోసారి జలపాతంలా దూకుతున్నట్టూ
ఒక్కోసారి నిండు గోదావరిలా ప్రవహిస్తున్నట్టూ
నేను పాఠాన్నై తరగతి నిండా కమ్ముకుంటాను
పాఠం ప్రాణవాయువును పీల్చుకుంటూ పసి మెదళ్ళు
మొగ్గ - పువ్వుగా రూపాంతరమొందే దశలో ఉంటాయి
నేనూ విద్యార్థులూ ఒకరి కోసం ఒకరు బతుకుతున్న
ఆ తాదాత్మ్యపు క్షణాల్లో ఉన్నట్టుండి
రసవత్తరంగా సాగుతున్న నాటకం మధ్యలో
చందాదారుల పేర్లు చదివినట్టు
మా ఏకాగ్రతను భగ్నం చేస్తూ
మా విజ్ఞాన ప్రపంచ ప్రాకారాన్ని పడదోస్తూ
గుమ్మం బయట డబ్బామూత చప్పుడవుతుంది
నిశ్చల నిర్మల తటాకంలోని ప్రతిబింబాలు
అలలు అలలుగా చెదిరిపోతాయి
నేను గుమ్మంలోంచీ పిల్లలు కిటికీలోంచీ
జానెడు పొడుగున మెడలు చాపుతాము
రహదారిపై కట్టిన 'సుస్వాగతం' వస్త్రతోరణంలా
బడిగేటు వద్ద ఐసుఫ్రూట్ అబ్బాయి
డబ్బామూత వాద్యంపై ఆహ్వానగీతం వాయిస్తూ
బడివద్ద ఐసమ్మకూడదని వాడ్ని కసురుకుంటాను
వాడు చూపులతోనే నన్ను బతిమాలుకుంటాడు
వాడు చూపులతోనే తన కుచేల సంసారపు చిట్టా పుటల్ని
ఒక్కటొక్కటిగా నాముందు తెరుస్తాడు
పెట్టెలోంచి తీసిన ఐసులా బొట్టు బొట్టుగా నేను కరిగిపోతాను
విరామ సమయం గంట కొట్టీ కొట్టగానే
పిల్లలు జయ్‌మంటూ వాడి చుట్టూ వృత్తం గీస్తారు

నట్టనడి వేసవి మధ్యాహ్నం నీటికోసం
సరస్సు చుట్టూ వాలిన రంగురంగుల పిట్టల్లా - పిల్లలు
ప్రదక్షిణలు చేస్తున్న ముత్తయిదువుల మధ్య తులసికోటలా - వాడు
పుల్లచుట్టూ ఐసు పేరుకున్నట్టు
అనుభూతి దృశ్య సౌందర్య పరిమళంగా వాడు నన్నల్లుకుపోతాడు
బరువెక్కిన జేబూ బరువు దిగిన గుండే
వాడి కళ్ళల్లో తృప్తి కిరణాలై మెరుస్తాయి
వెళ్తూ వెళ్తూ వాడు నాకో చూపు కృతజ్ఞత విసిరిపోతాడు
ఎప్పుడో నావద్ద చదివిన విద్యార్థి గొప్ప ప్రయోజకుడై
నమస్కారం మేస్టారూ అన్నట్టుగా నా మేను పులకిస్తుంది
ఇప్పుడు నాకు
మా బడి గంటలో వాడి డబ్బా మూత చప్పుడే వినిపిస్తుంది
ఇప్పుడు వాడు
మా బడి కాలనిర్ణయ పట్టికలో పదినిమిషాల పీరియడైపోయాడు
దూరంగా నిలబడి గుటకలేస్తున్న ఒక చిన్ని నోటికి
పెట్టెలో మిగిలిన ఒకే ఒక్క ఐసుఫ్రూటుతో
విందు చేసిన వాడి హృదయ సంస్కారం -
ఇంత సంపాదిస్తున్నా
ఒక్క పేద విద్యార్థికైనా ఉచితంగా ట్యూషన్ చెప్పని
నా మరుగుజ్జుతనాన్ని ఖండఖండాలుగా కత్తిరిస్తుంది
ఎండకూ గుండెకూ నడుమ మంచుధనుస్సునెత్తే వీరుడు
వాడు కనిపించేది రోజుకో పదినిమిషాలే అయినా
పాఠ్యపుస్తకం తెరవగానే కనిపించే ప్రతిజ్ఞలా కంఠస్తమవుతాడు
ఇప్పుడు నా గుండె 'మంచుపండు' ఆకారంలో ఉంది

# వెంటాడే వాక్యం



"వాళ్ళొక కారణంతో మట్టుబెడతారు
నేనొక కారణంతో మరణిస్తాను"

• • • • • • • • • • • • • •

అట్లాసు మీద ఆ దేశాన్ని చూడగానే అతడే జ్ఞాపకం వస్తాడు
వాతావరణం పులుగు రెక్కలు నా చుట్టూ టపటపమంటాయి
కాలుష్య మేఘాల్లో పొంచిన
అదృశ్య మారణాయుధాలపై యుద్ధం ప్రకటిస్తూ
అతడు రచించిన ఉద్యమ వ్యూహం
ఆ ఒక్క దేశం కోసమే ననుకుంటే పొరపాటు
ఏ నేల చుట్టూ వాతావరణం అల్లుకునుందో
ఆ నేల నాలుగు చెరగులూ
అతడి ఉద్యమ గీతపు చరణాలే అవుతాయి
అతడ్ని చంపేసామనీ చమురు గుంటలో పూడ్చేసామనీ
ఇనుప టోపీ తీసి గుండు సవరించుకునే నియంతలకు
హెచ్చరికగా
వెంటాడే అతని ఆఖరి వాక్యాల ఉపగ్రహాల్ని
భూగోళం చుట్టూ తిప్పుదామా .
స్వార్థ సామ్రాజ్యవాద దురహంకార శక్తుల
తుపాకీ పెత్తనాల నుంచీ
బహుళజాతి ధూమరక్కసుల విషవాయు నిశ్వాసాల నుంచీ
మీ మీ దేశాల శుభ్ర సౌందర్య
ఆనందాద్భుత దేహాల్ని సంరక్షించుకోమని
ఇవాళ మనకు మార్గాభ్యాసం చేసిన పరమాచార్యుడతడు
అతనికి మన వెన్నుపూసలను ఒలిచి హారం కడదామా .
అతడు మరణించాడని చమురు పీపాల మీద ఒట్లేసుకుని

వాళ్ళు డాలర్లను మత్తారా చుంబిస్తున్న సమయంలోనే
ఇక్కడ వేలవేల హరితార్ద్ర హృదయాల స్పందనల్లోంచి
పునర్జన్మించి
మనకు స్వయం రక్షణ కర్తవ్యాన్ని సూచిస్తున్న నాయకుడతడు
అతని మహోద్యమ చైతన్య గీతాలకు
మన గొంతుకలను మైకులను చేద్దామా
ఉరితాడుకు సైతం భయపడని అతని ధైర్యమెత్తిన
మన భుజాల మీది బాధ్యతల మూటలోంచి
ఇవాళ మనం వడబోత వస్త్రాన్ని తీసి ఆకాశానికంటించాలి
మధురమైన మన నీటి చెరువులూ
ప్రియమైన మన నివాస భవనాలూ
శ్యామలమైన మన పంట పొలాలూ
ప్రాణాలైన మన తేట పవనాలూ
సకల మానవ జంతు పక్షి సముదాయ సంపదలూ
కాలుష్య వాతావరణ దుశ్శాసన హస్తాల్లో చిక్కి
దిసమొలలవక ముందే
మన వాతావరణం మనల్ని వాతాపి జీర్ణం అనకముందే
స్వచ్ఛ వాతావరణం మన జన్మ హక్కని గర్జించే
జన గంగాధరులమవ్వాలి
నేల మీద పాదాలు ఆన్చి
అమ్మజని పిలుస్తూ బతికే మనుషులం మనం
ఈ సూర్యుడిలాగే వెలగనిద్దాం, ఈ వెన్నెల్నిలాగే కురవనిద్దాం
ముగింపు లేని పర్యావరణం గ్రంథం ప్రథమ పుటపై
అతడు తన గుండెనూ మెదడునూ చిత్రించి నిష్క్రమించాడు
మిగిలిన పుటలను మనం
పరిశుభ్రంగా పూరించుకుంటూ పోవాల్సిందే

# కాలవలో శవం

మరణించక ముందే
ఆమె ఎన్నిసార్లు మరణించిందో
చూస్తూన్న కళ్ళల్లోంచి
మనకెందుకులే తనాలను మోసుకుపోతూ
ప్రశ్నకూ జవాబుకూ మధ్య దూరం దొరకని
పోలీసులు కూడా ముట్టని
నగ్న కాలుష్యం
ఎవరికి చెల్లో ఇంకెవరికి కల్పవల్లో
ఎవరి పెదవి మీద నవ్వో
ఇంకెవరి ఇంట పూచిన పువ్వో
ఎవరైతేనేం?
కలల కలశం భళ్ళున పగిలుంటుంది
పెంచుకున్న ఆశల తోట నిలువునా దగ్ధమై యుంటుంది
హత్యలన్నీ ఆత్మహత్యలుగా
వేషం మార్చుకునే ఈ సమాజంలో
ఇది ఏదో నిర్ధారించలేం .
ఆడదైనందుకూ
అలుపెరుగని జీవితమైనందుకూ
అలవాటుగా ఈసారి ఆఖరి నిర్ణయం తీసుకొనుంటుంది
తల్లో తండ్రో అక్కో అన్నో ఎవరైతేనేం
ప్రేమించనో చూసించనో మాట్లాడించకో ఎందుకైతేనే-
అనుమానించి ఉంటారు అవమానించి ఉంటారు
చుట్టూరా గోడలు నిర్మించుంటారు
ప్రేమించని నేరానికో
ప్రేమించిన పాపానికో
ఏ పశువు విధించిన శిక్షో అయ్యుంటుంది

ఫస్టుక్లాసు పేరుతో
పరమాచార్యుడెవ్వడో కాటేసుంటాడు
ఇరుగు పొరుగు కాకులు
ఆమె శీలం మీద రెట్టలేసుంటాయి
బహుశా ఇది అత్తింటి అరాచకత్వమై యుంటుంది
ఆకతాయి వేధింపులకు గుండె అలసి
ఆఫీసరు ఆకలి చూపులకు శరీరం అలసి
ఆయనగారి అహం పోట్లకు ప్రాణం అలసి
బతుకంటేనే భయం వేసిందేమో
అసలు ఆడజన్మంటేనే అసహ్యమేసిందేమో
కిడ్నాప్ చేసో
సామూహిక అత్యాచారానికి గురిచేసో
ఎవరో ఆమె ప్రాణఫలాన్ని తెంపేసుంటారు
నగదు కోసమో నగలకోసమో
ఆమె నగవు నెవ్వరో నలిపేసుంటారు
బహుశా ఇది లాకప్ హింసైయుంటుంది
ఎవరైతేనేం?! ఎందుకైతేనేం?! ఎలాగైతేనేం?!
నెమలి కన్నుకి మేత పెట్టినప్పటి అమాయకత్వం
ఇంకా ఆమె ముఖం మీంచి తప్పుకోనే లేదు
అప్పుడే నూరేళ్ళూ నిండిన మాట నిజం
• • • • • • • • • • • • •
నాకిప్పుడామె శవం కుళ్ళిన సమాజం వాసన వేస్తోంది

# హింసక్రీడ

అమ్మ ఇచ్చిన టిఫెన్ డబ్బా నేల పాలైపోతుంది
చేతిలోని పుస్తకాలు చెల్లా చెదురైపోతాయి
దేవాలయం మొదటి గుమ్మం నుంచీ
యమదూతల కాపలా కొనసాగుతుంది
చుట్టూ చేరిన అరుపుల్లోంచీ తప్పట్లలోంచీ
కేరింతల్లోంచీ వళ్లంతటినీ గుచ్చే చూపుల్లోంచీ
భయం చెమటగా ఆవరిస్తుంది
అసహ్యాన్ని వంటికి పామినట్టు
గుండె కమిలిపోతుంది కుమిలిపోతుంది
వెలిగిపోతున్న ముఖాల్లోంచి
వెగటుతనమేదో ప్రవహిస్తుంది
వేగం రైలు వెళ్ళిన వెంట పట్టాలా
ఆపాద మస్తకం వేడెక్కుతుంది
బిక్కచచ్చిపోయినతనం తనువంతా తడుముతుంది
ఆడా మగా తేడా లేదు
అల్లరి చెయ్యడమొక్కటే తెల్సిన వాళ్ళకి
కొత్తదనం బెరుకుదనం ఏమీ తెలియనిదనం
పరమ పైశాచిక ఆనందమవుతుంది
తులసి మొక్కచుట్టూ
దురదగొండి చెట్లు మాటల్ని దూస్తుండగా
హింసా వినోదం రాజ్యమేలుతుంది
మొదటి 'భవిష్యత్తు స్వప్నపటం' ధ్వంసమవుతుంది
రింగు మాస్టరు ముందు మూగజీవిలా
చెప్పింది చేయక తప్పదు

స్నేహ వాతావరణాన్ని కలుషితం చేసే దుర్గంధ వీచిక
భరించక తప్పదు
చేతులు జోడించినా బతిమాలినా తెగించినా ఎదిరించినా
వధ్య శిలకెక్కడం మినహా మరో మార్గం లేదు
ఆ క్షణంలో - గుండె వేగం ఏ స్టెతస్కోపుకీ దొరకదు
ఆ క్షణంలో - ముఖ కవళికల మార్పులు ఏ కుంచెకూ చిక్కవు
అభద్రతా భావం గుండెను దొలిచేస్తూ
అవమాన భారం శిరసును వంచేస్తూ
ఆ క్షణంలో - చావెందుకు రాదో అర్థం కాదు
చదువుకోవడమొక్కటే తెలిసిన మనసూ వయసూ
ఆశాసౌధపు మొదటి మెట్టు వద్దే స్పృహ తప్పుతాయి
ఇది కచేరీ మొదలైన క్షణంలోనే తీగ తెగిపోవడం
ఇది విరబూయాల్సిన లేత కొమ్మలపై గొడ్డళ్ళ ప్రయోగం
అభిమాన భంగం ఆమె బ్రతుకును
బలి తీసుకున్న దృశ్యం గానీ
అవమాన భారంతో అతడు కాలేజీనొదిలేసిన
వైనం గానీ
మానవ మృగాల నేమాత్రం కదిలించవు
మరణ వాంగ్మూలమూ సాక్ష్యమూ లేవని
కేసు వీగిపోతుంది
చదువుకున్న సంస్కారం కాలేజీ భవనాల్లోనె
ఖననమవుతుంది


ఆంధ్రప్రభ దిన పత్రిక 3-1-93

# పారస్పర్యం



కదిలే గడియారంలో వాడూ నేనూ చెరో ముల్లు
భయ సందేహాల మీదా అలసత్వాల మీదా
మొట్టికాయలు వేస్తూ
నా ముందు వాడు బహుముఖంగా ఎదిగిపోతాడు
మూర్ఖత్వాల మీదా మొండితనాల మీదా
ఆగ్రహం కక్కుతూ
వాడిలో నేను మనిషిగా ఒదిగిపోతాను
వాడి చూపుడు వేలొక జీవన సత్యపు సూచికైతే
నా చూపొక విజ్ఞాన సూత్ర నిర్వచనమవుతుంది
వాడు నా గురించి తపస్సు చేసీ చేసీ
కొన్ని గొప్ప స్నేహానుభూతి చిత్రాలు గీస్తాడు
ఆ చిత్రాలు రచించే కుంచెలోంచి
నేను ఉషస్సు నెగరేసుకుంటూ వచ్చి
వాడి గుండెలో రొట్టె కాలుతున్న వాసనలా పరచుకుంటాను
ఒకరికోసం ఒకరు బ్రతకడం
ఎంత ఆనందమో చెబితే తెలిసేదా
ఒకరి స్పర్శతో ఒకరు వెలగడం
ఎంత అద్భుతమో ఊహకు అందేదా
వాడి వెచ్చని గుండెకూ నా తడి కన్నుకూ
నడుమ పూసిన ఇంద్రధనుసుపై
నేనూ వాడూ కాలు మీద కాలేసుకుని రీవిగా కూర్చొని
స్నేహం మిఠాయి పొట్లం విప్పుకుంటాం
ఎగరబోసే చాటలోంచి గింజలు రాలినట్లు
మాలోంచి మాటలు కురుస్తాయి
మా ఆలింగన బంధనంలోంచి రక విద్యుత్తు ప్రవహిస్తుంది

కదలని కాలానికి కాళ్ళొచ్చి
బుజ్జి కుక్కపిల్లలా మా చుట్టూ గంతులేస్తున్న ఆ క్షణాల్లో
మా మందహాసాల వెనుక విరిసే
పంటికొసల కలయికల్లోంచి
కొత్త కొత్త ప్రపంచాలు పరిచయమవుతాయి
అప్పుడప్పుడూ ఎరుపెక్కే మా కనుగ్రుడ్ల వేదికల మీద
స్వదేశీ కుంభకోణులు కొందరు
నగ్నంగా నృత్యం చేస్తారు
నమ్మకాల్ని నిలువునా నరికే ద్రోహులు కొందరు
అమ్మజని కక్కుకుని ఛస్తారు
సంగీతమూ సాహిత్యమూ కలసి గొప్ప పాటైనట్టు
వాడూ నేనూ కలసి స్నేహంలో తడిసి
ముద్దై గోదారై అమెజానై డాన్యూబై నైలై
అయిదు సముద్రాలవుతాం
కనుల తెరల మీద కలల కలంకారీ అద్దుకుంటూ
ఆశ నిరాశల సుఖ దుఃఖాల తప్పొప్పుల సమాహారమైన
ఈ జీవితం ప్రవాహాన్ని
స్నేహం వంతెన మీంచి అలా అలా దాటేస్తాం
నేల మీద కురిసిన వాన చినుక్కే
విత్తులోంచి మొక్కను లాగగల కళ పట్టుబడినట్టు
స్నేహ సంపదను నలుగురికీ పంచేవాడికే
బ్రతుకు చీకట్లను చీల్చటం సాధ్యమవుతుంది

ఈ నేలనే పుట్టి ఈ గాలినే పీల్చి
ఈ నీటినే తాగిన వాళ్ళం కాదా?
నిషిద్ధ రూపాల్లాగ నిషిద్ధ వాస్తవాల్లాగ
మేమిప్పుడు ఒకానొక విషాద దశలో నిలువుగుడ్లతో నిలబడ్డాం
మా పసితనాల ఎత్తునా మోహరించిన భయోత్పాతాల నడుమ
ప్రాణాలు అరచేతుల్లో కీచుమంటున్నాయి
ఏ అపరాత్రిలోనో బితుకు బితుకు నిద్రలో
అధికారులదో అనధికారులదో అంతుబట్టని ఆటవిక మూక దాడిలో
మా దేహాలు తూటాలు తూటాలుగా రాలిపోతున్నాయి
పాప్ సంగీతపు నిషాకి నిలువునా అతుక్కుపోయిన వాళ్ళనీ
ఆల్కాహాలిక్ మత్తుగ్లాసుల ఛీర్స్ చప్పుళ్ళే ఆదర్శమైన వాళ్ళనీ
శరీరాలున్నవి సరసాలకీ సరదాలకీ అని నమ్మేవాళ్ళనీ
రియోడిజనీరో వీధుల్లో అట్టలు కట్టిన మా రక్తం జిడ్డు
అంటదు గాక అంటదు . . .
అట్లాంటిక్ గాలులు మోస్తున్న మా గుండెల హోరు
సోకదు గాక సోకదు .
పర్వత సానువుల్లో ప్రకంపిస్తున్న మా చావు కేక
కదిలించదు గాక కదిలించదు . .
ఇక్కడి చెట్టూ చెరువూ రాయీ గోయీ పిట్టా పుట్టా
మా నమ్మకాల కవచాలు ఫట్మని పేలిన శబ్దాల్ని వినిపిస్తాయి
గుండ్రాలు గుండ్రాలుగా సిగరెట్ పొగలూదినంత ఖుషీగా
వంకీలు వంకీలుగా తల దువ్వుకున్నంత చులాగ్గా
మాపై హత్యాకాండ రోజువారీ కార్యక్రమంగా సాగిపోతున్నా
ఏమీ జరగనట్టు అంతా సవ్యంగానే ఉన్నట్టు
మనుషులు మాత్రం కిమ్మనరు గాక కిమ్మనరు .
చావు భయంతో పోటెక్కిన మా రక్త వేగాలతో పోటీ పడలేక

అమెజాన్ సతత హరితారణ్యాల్లోకి పారిపోతోంది
స్టార్ టీవీల్లో నగ్న శరీరాల్ని చూసే మీ కళ్ళకు
మేం మురికి పురుగులుగానే కనిపిస్తాం
మీ అందమైన భవనాల మధ్య మీ అద్దాల్లాంటి రోడ్ల మీద
మేం చెత్తా చెదారంలానే కనిపిస్తాం
మీ తెల్లని దేహాల మీద నల్లని మచ్చలుగానే కనిపిస్తాం
ఇన్నాళ్ళూ మీ అవసరాలకు మా ఎదుగుదలను దోచిపెట్టినందుకు
కటిక మృత్యువే మాకివ్వాళ బహుమతి
కష్టపడి పనిచేయడమే గానీ కత్తి ఎత్తడం ఎరగని వాళ్ళం
తలవంచుకుని పోవడం తప్ప తుపాకీ పట్టడం రాని వాళ్ళం
భయం భయంగానే మీకు దొరికిపోతాం
చావు కళ ముఖం మీద గట్టిపడి
గుండె గొంతుకలో కూడా ఆడని స్థితిలో మీకు లొంగిపోతాం
మీ కసాయి ట్రిగ్గర్ పాదాల్ని మా ఆయువుల మీద గుచ్చి
మమ్మల్ని అనాథలుగా మార్చిన మీ నేరాలను కడిగేసుకోండి
తలకెక్కిన కిరాయి కాసుల తిమ్మిరితో హఠాత్తుగా చుట్టుముట్టి
మా మొగ్గ ఊపిరులను తలో తుపాకెడు పంచుకుని
మమ్మల్ని చావడానికే పుట్టిన వాళ్ళుగా చేసిన మీ పాపాలను
ప్రక్షాళన చేసుకోండి
మా శవాల మట్టిని
మీ క్రోటన్ మొక్కలకో కాఫీ మొక్కలకో ఎరువుగా చల్లి
'మీ' దేశం సుందరమైందని
మీ కళాత్మక కొయ్యగుండెలతో సగర్వంగా ప్రకటించుకోండి
(బ్రెజిల్‌లో అనాథ పిల్లల్ని క్రూరంగా హత్యచేయడాన్ని నిరసిస్తూ)

ఎడ్లబండి తొట్టెలో అతడు లేని లోటు
ఆ కుటుంబం సమస్తాంగాల మీదా తోలు కర్రలా మోగింది
చేతికర్ర నిలువునా చీలి పాడెకు పెండెగా మారింది
తలగుడ్డ శవం గుడ్డగా చితికి చేరింది
హృదయాల్ని వెలిగించే ప్రేమ కరెంటు తీగ తెగిపోయీ
చుట్టూ పేరుకున్న విశ్వాసావరణపు తడి ఆరిపోయీ
ఆ ఇల్లు కళ్ళ ఎరుపు చాటున మౌనంగా
శోక గరళాన్ని మింగుతోంది
అహింస గురించీ మనసు గురించీ ఉపన్యాసాలిచ్చే వాళ్ళను
ఈ తుపాకీ మోతకేం అర్థం చెబుతారో అడగాలి
వానా వాగూ, క్రిమీ కీటకమూ, దళారీ వ్యాపారీ లాగే
రక్షక కంచె కూడా మోసం చేస్తుందని
జాతి యావత్తుకీ అవగతమైంది
పర్యటనలకూ పత్రికా ప్రకటనలకూ అన్నం సహిస్తుందా
పరామర్శలూ హామీలూ మరణించినవాణ్ని బతికిస్తాయా
జీవితం భళ్ళున ముక్కలయ్యాకా
దుఃఖాన్ని ఆర్పడం ఎవరి తరం?

• • • • • • • • • • • • • •

ఎక్కడ నా జతగాడని ఎదురు చూసే
పంటచేను కెవరు చెబుతారు సమాధానం?
ఏడీ నా చిట్టి తండ్రని విలపించే
నల్లమబ్బు అశ్రువుల నెవరు తుడుస్తారు?
చేలో శ్రమించి తన నీడను విశ్రమించే
శ్రమైక జీవన సౌందర్య కథ నాయకుడేడని
ఎవర్ని అడగాలీ చెట్టు?

చేనుగట్టున నిలబడి తన నదిలించే
నిలువెత్తు వరికంకి నేస్తానికేమయ్యిందని
ఎవర్ని ప్రశ్నిస్తుందీ పిట్ట?
ఇక కోడిపుంజు కూతకు మేల్కొనేదెవరు?
మోర పైకెత్తి అరిచే ఆవు గంగడోలు దువ్వేదెవరు?
అర్ధరాత్రి కలత నిద్రలో రైలు కూతకు ఉలిక్కిపడి లేచి
ఇల్లాలూ పిల్లలూ అతడి ఫొటో ముందు దీనంగా నిలబడినప్పుడు
వాళ్ళ భవిష్యత్తేమిటి?

• • • • • • • • • • • • •

కాలం ఎన్ని అగాధాలనైనా పూడ్చేయ్యగానీ
ప్రేమల్నీ అనుబంధాల్నీ రక్తపాశాల్నీ పూడ్చలేదు
అలవాట్లనూ పూడ్చలేదు
అతని కోసం ఎదురుచూసే అలవాటునీ
అతని కోసం పొలానికి టీ నీళ్ళు పంపే అలవాటునీ
అలవాట్లు జీవితం శరీరానికి స్పర్శలు
పిల్లల్తో పాటు అతనికీ పెట్టిన కంచంలో
కన్నీటి బొట్లు రాల్తాయి
మనం తింటున్న ప్రతి అన్నం ముద్దా వాడి చలువే .
ఆ ఊరి మీదుగా రైలు శబ్దాలు ప్రయాణిస్తున్నంత కాలమూ
తుపాకీనీ
తుపాకీ మోతనీ
తుపాకీ విశ్రమించే తోలు సంచీనీ
తుపాకీకి లైసెన్సు ఇచ్చిన వాడినీ
అక్కడి చెట్టూ చేనూ ప్రశ్నిస్తూనే ఉంటాయి
అతడి ఇల్లు పిడికిళ్ళు బిగిస్తూనే ఉంటుంది

# చిత్రగీతం

భగ్వాన్
వడ్లబండి



ఈ పాటను పాటగా పాడడం మన వల్ల కాదు
ఇప్పటి పాటకు పల్లవి ప్రాణం కాదు
పాట కోసం మనమూ మనకోసం పాటా
బతికే రోజులు కావు
ఇప్పటి పాటకు ఊపే కానీ చూపూ లేదు రూపూ లేదు
తన అవయవాల్ని తనే నరుక్కుని
పాట ఇప్పుడు విరుపుల నాట్యం చేస్తోంది
మన బలహీనతల సున్నిత కోణాల వంక
జోదర్థాల గుర్రాలెక్కి పాట దండెత్తి వచ్చింది బికేర్‌ఫుల్
పాటల కేసెట్ కాదది
సినీ సృష్టికర్తల కామసూత్ర పదచిత్ర భంగిమల స్వరపేటిక
ఇప్పటి పాటలో రసం లేదు
ఇప్పటి పాటకు పరవశం రాదు
గంజాయి దమ్ములా ఒకానొక సుఖవ్యాధిలా
పాట బరితెగించింది
పాట ఇప్పుడు వలువలిప్పుకుని నగ్నంగా నిలబడ్డ మనిషి
పెదవుల కొమ్మల ఊగే పలకరింపు మిరాయి పొట్లమూ
మనసు పొరల జీరాడే పసిమివర్ణపు ఊహల జలతారూ
పాట శరాఘాతానికి టుపుక్కున తెగి
బూతు బురదలో పొర్లుతాయి
దేశం తగులబడిపోయే విధంగా
భాష రక్తం కక్కుకుని మరణించే విధంగా
పాట బజార్న పడింది
మృదు మంజుల మోహన గీతిక అడ్రసు మారింది

న నిలబడి తన నటిలింపే
వరికంకి నేస్తానికేమయ్యిందని
ప్పిస్తుంది ఏట్లు?
ంజు కూతకు మేల్కొనేవాడు!
? అరిచే ఆవు గంగడోలు దువ్వేవాడు!
ంత నిద్రలో రైలు కూతను ఉలిక్కిపడి లేచి
ల్లాగా అతడి ఫోటో ముందు దీనంగా నిలబడినప్పుడు
త్తేమిటి?

• • • • • • • •

ంగాధాలనైనా పూడ్చొచ్చుగానీ
బంధాల్నీ రక్తపాశాల్నీ పూడ్చలేము
పూడ్చలేదు
ఎదురుచూసే అలవాటునీ
ంలానికి టీ నీళ్ళు పంపే అలవాటునీ
తం శరీరానికి స్పర్శలు
ంతనికి పెట్టిన కంచంలో
ల్తాయి
ప్రతి అన్నం ముద్దా వాడి పలుకే....
్ రైలు శబ్దాలు ప్రయాణిస్తున్నంత కాలము

ే తోలు సంచీనీ
ఇచ్చిన వాడినీ
హా ప్రశ్నిస్తూనే ఉంటాయి
ళ్ళు తిగిస్తూనే ఉంటుంది.

వాడు రూపాయలు మాత్రమే తిన మరిగినవాడు
వాడికి నువ్వు నిలువెత్తు రూపాయల మూటవు
మనిషివి కావు
అమాయకత్వం ఆసరాగా సొమ్ములు దండుకునే వాడికి
ఆప్యాయతలతోటీ అశ్రువుల తోటీ పనేమిటి?
చిటికెడు బూడిద రంగు చక్కెర చల్లి
విసిరిన వాడి వలకు చిక్కాకా తప్పించుకు పోవడానికి
పక్షి గుంపు నీ కాదర్శమవుతుందా! ?
పచ్చబొట్టు పొడిపించుకున్నంత తేలిగ్గా చేసుకున్న అలవాటు
పచ్చబొట్టు లాగే జీవితాంతం వదలదు
జీవన రహదారిపై వ్యసనంలా పేలిన మత్తు పాతర
రసం పీల్చేసిన చెరకు పిప్పిలా నిస్సెండగడుతుంది
పట్టుకుచ్చు లాంటి శరీరం తాటిపీచు కట్టలా మారిపోయీ
స్వప్నాలూ స్పర్శలూ రాలిపోయీ నిద్రహంస ఎగిరిపోయీ
బయట పడనీయని బానిసత్వం ముందు
బంధాలన్నీ ఓడిపోతాయి
మమతానురాగాల సౌందర్యానుభూతుల స్వంత ప్రపంచం విడిచి
గంజాయి దమ్ముల స్వర్గకూపం విడిది చేసుకోవాలన్న కోరికలో
సుఖమేదో దొరికినట్టే దొరికి బతుక్కి దుఃఖం ఉరి పడుతుంది
మానవ సంబంధాలన్నీ మాదకద్రవ్యాల్ని కక్కుతాయి
అద్దాల గదిలో ఎగిరి ఎగిరి తల పగిలిన పిచ్చుకలా
రెక్కలు వాల్చేసాకా
నీకు ఊరైనా కాడైనా ఒక్కటే
ఆశించిన వేళకి రక్తంలోకి మత్తు ప్రవహించనప్పుడు
కళ్ళముందు పంచవర్ణ చక్రాలేవో తిరుగుతున్నట్టూ

గోళ్ళ సందుల్నీ చర్మ రంధ్రాల్నీ చీల్చుకుని
క్రిములేవో ఎగురుతున్నట్టూ
గొప్ప నిస్సత్తువ ఆవహించి ఏ గ్లాసులోకో
నువ్వు జావలా కారిపోతున్నట్టూ
నీ అవయవాలన్నీ అదుపు తప్పి నిన్ను ఎన్‌కౌంటర్ చేస్తాయి
నీ ఇల్లు నిన్ను పోస్టుమార్టమ్ గదిలా భయపెడుతుంది
సహచరులు నీ చుట్టూ మోహరించిన హంతకుల్లా తోస్తారు
కుటుంబం తల మీద ముళ్ళ కిరీటంలా బరువై
సమాజం శరీరంలో ఎయిడ్స్ క్రిమిలా భయంకరమై
అందరి నాలుకల మీదా ఒక బూతు మాటలా అసహ్యమై
నీ విస్మృత భవిష్యత్తును
రోజులుగా గంటలుగా నిమిషాలుగా కుదించుకుని
నలుగురు మనుషుల వాహనమెక్కి ఉత్తర దిక్కుకు మాయమవుతావు
నీ వికృత జ్ఞాపకాలు మాత్రం
రొద చేస్తూ గబ్బిలాల్లా ఇల్లంతా తల క్రిందులుగా వ్రేలాడతాయి
ఇప్పుడు నేనెవర్ని కోపించాలి
వ్యసనం క్రషర్‌లో నలిగి నజ్జవుతున్న నిన్నా -
బలహీనతల మీద ఉచ్చువేసి
కలల భూమి నాక్రమిస్తున్న కుట్రదారుడ్నా-
చేల ప్రాణ శక్తిని దోచుకునే కలుపును శిక్షించలేని కాపలా అధికారినా-
చివరగా మరోసారి మాట
నువ్వు అవశేషం కారాదు ఆవిరీ కారాదు
అవశేషమూ ఆవిరీ కలగలిసిన ద్రావణంలా బతకాలి

# బొత్తం పట్టని కాజా

చదువుకుంటానంటే చంపుతానని నాన్నా
సినిమా కెళ్తానంటే తంతానని యజమానీ
వాడి బాల్యానుభూతుల మామిడి పూతల మీద
మంచులా కురుస్తారు
ఇంకా పిడికెడు అనుభవాలైనా ఏరని
వాడి పసి  చేతుల్లోకి
కుటుంబ స్థితిగతులు సూది మొనల్లా దిగుతాయి
జీవితమంటే మాయ మంత్రాల
జానపద సినిమా కాదని తెలిసిపోతుంది
ఇష్టం లేకపోయినా అదే
జీవనాధారమని అర్థమైపోతుంది
ఇక సూదీ దారమే వాడికి బంధువులూ స్నేహితులూ
పొద్దున్నెప్పుడో తిన్న గుప్పెడు తరవాణీ మెతుకులూ
మధ్యాహ్నం యజమాని పోయించిన గుక్కెడు టీ నీళ్ళూ
ఇవే వాడికి పంచభక్ష్య పరమాన్నాలూ

• • • • • • • • • • • • •

కాజా చుట్టూ అద్భుతంగా దారాన్ని అల్లే సాలీడు
తన బతుకు వస్త్రం చిరుగులనేమాత్రం కుట్టుకోలేని
జాలి కథ నాయకుడు -
రీలు నుంచి దారాన్ని తెంపుతున్నంత సులువుగా
తన గుండె కండె నుండి కష్టాల్ని తెంపుకోలేని
శోక తప్త గీత గాయకుడు -
కుట్టు సరిగా లేదని యజమాని నోరు పారేసుకుంటే
కత్తిరించి ఓ మూల పారేసిన గుడ్డ పీలిక వాడు -
నెలాఖరు క్షణాల్లో కల్లు గుర్రమెక్కి వచ్చిన తండ్రి
జేబును గుంజుకు పోయినప్పుడు

చొక్కా నుండి తెగి పడిన బొత్తం వాడు -

• • • • • • • • • • • •

వాడి చుట్టూ దండాల మీంచి
సీతాకోక చిలుక రెక్కల్లాంటి బట్టలు వ్రేలాడుతుంటాయి
వాడి కళ్ళల్లోంచి మాత్రం
నాన్న నోట్లోంచి కురిసే బూతులూ
రంగు వెలసిన అమ్మ నవ్వులూ వ్రేలాడుతాయి
రంగు రంగు దుస్తుల అంబారీల్లో
దొరబాబు లొస్తుంటారు పోతుంటారు గానీ
వాడి కేసి కాసిని చూపుల అక్షింతలైనా చల్లరు
టీ తేవడం ఆలస్యమైందని
యజమాని కొడుకు చేయి విసిరినప్పుడు
పౌరుష మొచ్చినా
ఇలాయి బుడ్డి పొగ చూరిన అమ్మ కళ్ళల్లోని జీవితం
వాడ్ని బుద్ధుడ్ని చేయడం
ఎవరూ గమనించరు
సినిమా పేర్లు చదవడం వరకే
పరిమితమైన వాడి అక్షర జ్ఞానం
ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్ స్టార్ల యూనిఫామ్‌లను
తడి చేయడం
ఎవరూ తెలుసుకోరు
రెండు వేళ్ళ నడుమ కదిలే సూది
నాణెం మీది రెండు కంకుల నడుమ ఒకటి అంకెలా
ఊరించడం
ఎవరూ గ్రహించరు
గిర్రుమని తిరిగే మిషన్ల హోరులో
వాడి గుండె మూలుగుల్ని ఎవరూ వినరు

వాడు తన ఆశల  కంఠాలకు
దారాలతో ఉరివేయడం గానీ
తన ఊహల రెక్కలను
కత్తెర మొనలతో తుంచెయ్యడం గానీ
ఎవరూ పరికించరు

• • • • • • • • • • • •

సూదిలో దారం ఎక్కించేటప్పుడు
వాడు అచ్చు తుపాకీలో తూటాలెక్కించే సైనికుడే
కాజాలో బొత్తాలో అంచులో కుడుతున్నప్పుడు
వాడు అచ్చు చిక్కుదీసి తల దువ్వుతున్న అమ్మే
కుట్టిన దుస్తుల్ని దులిపి మడత పెడుతున్నప్పుడు
వాడు అచ్చు పసి మెదళ్ళ అజ్ఞానాన్ని దులిపే గురువే

• • • • • • • • • • • •

చిత్తుగా తాగి వచ్చిన తండ్రిని
నిలదీయనూ లేక
నెత్తీ నోరూ బాదుకుని విలపించే తల్లిని
సముదాయించనూ లేక
పళ్ళ అంచులతో తెంపి ఉమ్మే
దారపు కొసల సాక్షిగా ఎప్పటిలాగే
తన కళ్ళ గ్రహాల్ని ధీకొనే
అవసరాల తోక చుక్కల్ని మోసుకుంటూ వాడు -
వాడి స్పర్శలో నలిగి పునీతమైన బట్టల్ని తొడుక్కుని
శరీరం నిండా గర్వాన్ని పూసుకుంటూ నేను -

# నీకంటె ఎత్తులో నేను

భగ్వాన్ 30
వర్ధబంది

నిర్మలంగా ఉన్న సరోవరంలో తటాలున రాయి వేసావు
కట్టుకున్న పిచ్చుక గూళ్ళను తన్నేసావు
నవ్వుతూనే మాట్లాడుతూనే నిప్పును రాజేసావు
హంతకుడు నువ్వేనని నిరూపించడం చాల కష్టం
పదవి కాదు పలుకు శాశ్వతం
కళ్ళనుంచి కసిలా కురుపునుంచి రసిలా
ఈర్ష్య ప్రవహిస్తూనే ఉంటుంది నీలోంచి మర్మంగా
నా కవిత్వం నిన్నేం చేసిందని ఇంత నింద వేసావు
నీ భజన సంఘంలో చేరలేదనా
నీ ముందు చేతులు నలుపుకుంటూ నిలబడలేదనా
నీకూ నీ కులంవాళ్ళకీ అడుగడుగునా దండాలు పెట్టలేదనా
ఏదైతేనేం?
తోడేళ్ళ మాటల బలంతో అమాయక గొర్రెను బలిచేసావు
పేద పురుగులను కౌగలించుకొని తేనెటీగలను నలిపేసావు
ముఖం నిండా పదవీ రక్తం పులుముకున్న ఓ అసూయా
స్థాన చలనం నాకు కొత్తా కాదు, భయమూ లేదు
కాకపోతే అది జరిపించిన తీరే కలవరపెడుతోంది
ఒక్కటి మాత్రం నిజం
నేను ఊపిరి పీల్చుకుని మళ్ళీ తల ఎత్తేసరికి
నీ పదవీ కాలం పూర్తవుతుంది
నువ్వు కట్టుకున్న అహంకారపు కోట బద్దలవుతుంది
నువ్వు పెంచుకున్న శునకం కూడా నిన్ను చూసి తోకాడించదు
నాకు చేసిన అన్యాయాన్ని తలచుకుని అప్పుడు కుళ్ళికుళ్ళి ఏడుస్తావు
నేను మాత్రం ఎప్పటిలాగే అంచెలంచెలుగా పైపైకి సాగిపోతూ

# మౌసమ్ కీ జాన్‌కారీ

భగ్వాన్
వడ్లబండి



మన ఉదాసీనతల నుంచీ
మన నిర్లక్ష్యాలనుంచీ
అన్నీ ఆమ్ల వర్షాల మబ్బులే కమ్ముతాయి
నింగి వంగి కాలుష్యానికి సలాము చేస్తుంది
చెత్తా చెదారమూ
వాహనాల పొగల సుడులూ
పరిశ్రమల రసాయనాల విషవాయువులూ
రణగొణ ధ్వనులూ
ఆకలిగొన్న చెదపురుగులై
ఓజోను పొరను భోంచేస్తాయి
పర్యావరణం ప్రకృతి ఫలహారానికి బయలుదేరుతుంది
పచ్చదనం పండువెన్నెల జాడలు స్వప్నాల్లో కూడా దొరకవు
నీటికి జీవగుణం లేక గాలికి ప్రాణబలం లేక
చెట్లు కుక్కమూతి పిందెల్ని తొడుగుతుండగా
పశువులూ పక్షులూ జలచరాలూ
గుంపులు గుంపులుగా చస్తూండగా
బిడారు లెదారులవుతాయి
నేలకు నెర్రలు పడి మానప్రాణాలు పోతాయి
కళ్ళముందే పగలు కాలిపోతుండగా
బయట తిరగడం నిషేధమై
రోడ్లు నిర్మానుష్యాన్ని కౌగలించుకుంటాయి
నదులింకి పోతుండగా వనాలెండిపోతుండగా
నేలతల్లి పిల్లల మీద స్లోపాయిజన్ జరుగుతుంది
ఏది పగలో ఏది రాత్రో

ఏది ఎండో ఏది వెన్నెలో
తెలియనంతగా కాలం పగబడుతుంది
ఏది కాకో ఏది కోకిలో
ఏది పువ్వో ఏది ముల్లో
ఏది చెట్టో ఏది పుట్టో
తెలియనంతగా దృశ్యం తిరగబడుతుంది
రెటీనాల మీద
గాఢాంధకారం పెయింటింగ్ వ్రేలాడుతుంది
యవ్వనంలోనే ముసలితన మొస్తుంది
మనిషి సృష్టించుకున్న భోగ వస్తువులు
మనిషి మీదే దాడి చేస్తాయి రహస్యంగా
ఆత్మరక్షణ కరువవుతుంది
వ్రణాలుగా అంటురోగాలుగా అంగవైకల్యాలుగా
అతినీల లోహిత కిరణాలు దేహాల్ని చీలుస్తాయి
ఉపద్రవాలు నేల నేలుతాయి
ఉత్పాతాలు కోరస్ పాడుతూ ఊరేగుతాయి
చూపుల్లో భయం శ్వాసల్లో భారం
ఊహలన్నీ కలకలం కలవరం
ఆగామి కాలమంతా అగాధాల పుంత
ఇరవయ్యొకటో శతాబ్దపు పుస్తకం నిండా
అన్నీ అచ్చుతప్పులే

14-7-92



ఆంధ్రభూమి దిన పత్రిక 21-9-92

# కాఫీరాగం

గడియారం ఏడు కొట్టినా ఇంకా రాలేదేమిటి చెప్మా
'పుంవాయ్' సంగీతం వినిపించదేమిటి చెప్మా
కిటికీ చువ్వల్లోంచి సాగదీసిన కన్నులతోనో
సగం తెరచిన తలుపుల్లోంచి జిరాఫీ మెడతోనో
మెట్ల మీద పారేసుకున్న చెవులతోనో
ఎదురు చూసీ చూసీ కళ్ళల్లో నొప్పులు పుడతాయ్
పక్కవీధిలో బాబిగాడి రిక్షా బెల్లు హెచ్చరిస్తోంది
వాడ్ని తయారుచేయొద్దూ . ఓపికేదీ?!
సిగ్నల్ కోసం అరిచే రైలులా చంటిది ఒకటే ఏడుపు
దాన్ని సముదాయించొద్దూ . నీరసమొస్తోంది!!
కాఫీ టానిక్కు ఏ తని ప్రాణం
ఇంధనం లేని ఇంజనవుతుంది
ఆ కాస్త అమృతం గొంతును తడపకపోతే
ఇంటెడు చాకిరీ చేసేదెట్లా?!
స్నానం చేసీ చేయగానే సైరెంజనులా సణుగుతుంది అత్తగారు
పూజ ముగిసినా తీర్థం తీర్థం అంటూ
మంత్రజపం చేస్తూనే ఉంటారు మామగారు
'బెడ్‌కాఫీ! బెడ్ కాఫీ'! నిద్రమంచం బద్ధకంతో అరుస్తుంది
అలా ముడుచుకు పడుకోకపోతే వీధి చివరకు వెళ్ళి చూసి రారాదూ
సాధింపులు వేదెక్కుతాయ్
రైలు గేటేదైనా పడిందా ఏమి? ట్రాఫిక్ జాం కాలేదు గదా!
ఇంత అలస్యమైందేమిటి చెప్మా
ఏమండోయ్ పిన్నిగారూ మీ పాలొచ్చాయా?
ఏమే సుబ్బులూ మీ పాలవాడొచ్చాడా?

మా ఖర్మే కాలిందన్నమాట
చిరాకులో గిన్నెలు గింగిర్లు తిరుగుతాయి
పరాకులో పంపులో నీళ్ళు నిండుకుంటాయి
బాబిగాడి వీపు మీద సీమటపాసులు ప్రేలుతాయి
'ఈ సంసారం నేను చేయలేను బాబూ' అన్నంతగా
ఇల్లు మునిసిపాలిటీ కంపు కొడుతుంది
ఏదో పారేసుకున్నట్టు
నిమిషానికోసారి చూపులు వీధిని కొలుస్తాయి
ఏ సైకిలు శబ్దం విన్నా
వీధి కొస వరకూ చెవులు దీర్ఘాలవుతాయి
చెవులు తప్ప ఏ అవయవమూ పనిచేయని స్థితిలో
నిమిషమో యుగంగా, ఇల్లే అడవిగా
చుట్టూరా మనుషులే రాక్షసులుగా
మనస్సూ శిరస్సూ శరీరమూ భారాతి భారమవుతాయి
ఖాళీ పాలగిన్నె వెక్కిరిస్తుండగా
అమృతం పాత్రతో అవతరించిన ఆదివిష్ణువులా పాలవాడొస్తాడు
పాలొచ్చాయన్న ఆనందంలో
అవి నీళ్ళో పాలో గుర్తించం, కొలత సంగతి గమనించం
గొంతులో కాఫీ సరిగమలు పలికించగానే
రేడియోలో సూక్తి ముక్తావళిని సహించేంత శక్తి వస్తుంది
సాయంత్రం తెలుగు టీవీని భరించేంత ఉత్సాహమొస్తుంది
'మేరా భారత్ మహాన్' నినాదం అందంగా వినబడుతుంది

# పొల్లుగింజ



ఇకనుంచీ చెట్టూ గొడ్డూ పల్లెవి కావు
నాటాల్సిన విత్తనమేదో చల్లాల్సిన ఎరువేదో
అమ్మాల్సిన పంటకెంత ధరో .
ముందుగానే జరిగిపోయిన ఏకపక్ష నిర్ణయాల మధ్య
ఇకనుంచీ రైతు పేరు వెన్నెముక కానే కాదు
కఱ్ఱ పుచ్చుకున్న ధనిక దేశం మోళీ వాడి ముందు
మనం కోతుల్లా ఆడడం మొదలెట్టాకా
పల్లె పల్లెలా ఉండదు, పల్లె పల్లెలో ఉండదు
లిక్క చచ్చిన చూపులూ తడారిన గొంతుకలూ
దరహాసాల తుమ్మెదలు వాలని పెదాలూ
పల్లె ముఖచిత్రం మీద ఉలిపిరి కాయలుగా మొలుస్తాయి
రాత్రి పల్లె కనే కలలకు తెల్లారకుండానే అబార్షనవుతుంది
పెరటి చెట్టు మీద వాలే పక్షుల కువకువల కులాసాలూ
పాక చుట్టూ పశు శిశువుల చెంగు చెంగుల సౌందర్యాలూ
పరిగలేరే పసి వయసుల కిలకిలల అనుభూతులూ
వరిచేల మీంచి వీచే బృందగాన తెలి తెమ్మెరల సోయగాలూ
పిడకల దాలిలోంచి ఎగిరే పాలపొంగు పరిమళాల పరవశాలూ
తనువంతా తడిమే దృశ్య సంపదలన్నీ దోపిడీ అయ్యాకా
పల్లె బిడ్డకు బాల్యముండదు, పల్లె పడుచుకు యవ్వనముండదు
పల్లెత్తు పలకరింపు పల్లెలో దొరకదు
ఏ జబ్బుకు ఏ మందు ఎవరి దగ్గర ఎంతకు కొనాలో
నిర్ణయం ఖండాంతరాల వాడికిచ్చాకా
తలనొప్పి కూడా ఖరీదైన జబ్బై
పల్లె ఆరోగ్యం మీద క్రిములు పాకుతాయి
తొలిసారిగా పరికిణీ కట్టిన పాపలా మురిసే పల్లె

మాయల మాంత్రికుడికి చిక్కిన
బాలనాగమ్మలా బావురుమంటుంది
మంచు గుర్రమెక్కి వచ్చిన తెల్ల వ్యాపారికి తల వంచాకా
కుమ్మరి చక్రమూ తిరగదు, కమ్మరి కొలిమీ వెలగదు
అట్లతద్ది ఆరట్లూ ఉడకవు, గొంతెమ్మ పండుగా జరగదు
బడి గంటా మోగదు, గుడి స్పీకరూ పాడదు
చూరులకు కంకుల తోరణాలు వ్రేలాడవు
కార్తీక వన సంతర్పణల సంబరాలు ఉండవు
గంగిరెద్దులు అయ్యగార్లకు దండాలు పెట్టవు
ఆనవాయితీలన్నీ దారితప్పి
ఆత్మీయతా స్పర్శలు మూర్ఛపోతాయి
బట్టలు కుట్టే చలపతీ, పాలకేంద్రం పాపారావూ
బడ్డీ హోటలు చంద్రావూ, టముకు వేసే పైడితల్లీ
ఒక్కొక్కరూ పొట్ట చేత్తో పట్టుకుని పల్లె విడిచి పోతారు
పల్లె తినే తిండి మీదా, పల్లె కట్టే బట్ట మీదా
పల్లె పీల్చే గాలిమీదా, పల్లె తాగే నీటి మీదా
ఎంత రాయల్టీ వసూలు చేయాలో
విదేశాల నుంచి ఆదేశాలు దిగుమతి అయ్యాకా
కొడవలీ గునపమూ నాగలీ గొడ్డలీ తుప్పుపట్టి అటకెక్కుతాయి
వడ్లబండి రిక్షాబండిగా చిన్నబోతుంది
దాణాలేని పల్లె పశువులకు వాల్‌పోస్టర్లు కమ్మగా రుచిస్తాయి
గూటీ బిళ్ళా ఆడిన చేతులు హోటల్ కప్పుల్ని కడుగుతాయి
పల్లె చివికీ చితికీ పట్టణ ముఖంగా కుంటుతుంది
గ్రామీణ సంస్కృతి నశించి వలస సంస్కృతి వెలిశాకా
నీటికోసం తవ్వుకున్న గోతులే సమాధులవుతాయి

# పల్లె రమ్మంటూంది

కాటువేసే కాలుష్య సర్పం
పచ్చదనం నాగస్వరం ముందు తలవాలుస్తుంది
పర్యావరణం పరదా విప్పుకుని
పసిమి ఛాయ ముఖంతో ఎదురొస్తుంది
పల్లె శరీరంలోకి పరకాయ ప్రవేశం చేస్తే
పసిడి నవ్వుల పెదవి పేరు పేరునా పలకరిస్తుంది
పల్లె మన తరతరాల వారసత్వ సంపద
పల్లె మన పంచప్రాణాల చెలికాడు
తాటిముంజెలా చెరకు పానకంలా నిమ్మపూల వాసనలా
పల్లె నవ్వు ఎంత కమ్మగా ఉంటుందనీ
పల్లెలో వీధివీధినీ కలిపే రహదారి
మనిషినీ మనిషినీ కలిపే కరచాలనంలా ఉంటుంది
నగరమంతా తిరిగి తిరిగి
పలకరింపుల పరామర్శకు మొహం వాచి
పల్లె ఒడికి చేరగానే
పెదవి మీద గుమ్మపాల ధార కురుస్తుంది
ఉట్టిలోని వెన్నగిన్నె వీపు నిమురుతుంది
మజ్జిగ చిలికే కవ్వం చప్పుడు గుండె సంగీతమవుతుంది
పైరు సముద్రం నడుమ దీవిలా ఉంటుంది పల్లె
పాపాయి గుండె మీద పచ్చల హారంలా ఉంటుంది పల్లె
తాటాకు చాప మీద ఆరబెట్టిన మామిడి తాండ్రతోనూ
అవ్వ గంపలోని ఉడకబెట్టిన చిలగడ దుంపలతోనూ
చూపు జతకట్టినప్పుడు

పల్లె మన భుజం మీద చెయ్యేసి బాల్యంలోకి లాక్కుపోతుంది
మస్తాన్ తాత భుజం సవారీ ఇప్పటికీ గుర్తొస్తుంది
డేవిడ్ మామ సైకిల్ గంట చెవుల్లోనే కాపురముంటుంది
తాటిచెట్టు మీద కల్లు గీసే యువకుడూ
పొలంలో నడుం వంచిన అమ్మాయీ
కనుపాపల్లో బొమ్మల కొలువు తీరుతారు
పట్టె మీదుగా కాలువ దాటుతున్న పాదాల కదలికలు
అత్యంతాద్భుత అవ్యక్తానుభూతి కావ్యాల్ని నిర్మిస్తాయి
నగరంలోకి సూర్యుడు పల్లెను పలకరించే వస్తాడు
వెన్నెల పల్లెలోనే
అందమైన ఆడపిల్ల ముక్కుపుల్లలా మెరుస్తుంది
రైల్లోనో బస్సులోనో పల్లెను స్పృశిస్తూ పోతున్నప్పుడు
గొప్ప క్షణాలేవో జారిపోతున్నట్టు
గుండెలో గొడవ గొడవై పోతుంది
మామిడి కొమ్మకు వ్రేలాడే తేనెపట్టూ
జామకాయను కొరికే రామచిలుకా
ఈతమట్ట చివర ఊగే పిచ్చుక గూడూ
చెంగు చెంగున గెంతే కోడెదూడా
చేపపిల్లను వేటాడే తెల్లకొంగా
ఏ కుంచెకూ అందని సజీవ చిత్రాలై చూపుల్ని కట్టేస్తాయి
శ్రమజీవన తాత్వికత పునాదిగా పల్లె
ఒక విశ్వాస ఛత్రం నీడలోకి ఆహ్వానిస్తుంది
అనిర్వచనీయమైన ఆత్మీయతా దృశ్యాల వేదిక - పల్లె
దేశం చుట్టూ పేరుకున్న ఓజోన్ పొర - పల్లె

26-5-93

# ఎదురు చూస్తున్న దృశ్యం

భగ్వాన్

వడ్లబండి

నేల మీదే కాదు నిద్ర మీద కూడా
నమ్మకాన్ని వదులుకుని
భూమిని తిట్టుకుంటూ దేముడ్ని శపించుకుంటూ
ఎక్కడికని పోతావ్!?
మన్నునీ మృత్యువునీ కాదనుకుని ఎక్కడికని పోతావ్!?

నిజమే, నేల నిన్ను నిలువునా కూల్చేసింది - కాదనను
నేల నీ సమస్తానుభూతుల మీదా మన్ను పోసింది - కాదనను
అలాని ఎక్కడికని పోతావ్!?
ఎక్కడైనా ఈ నేలే కదా
ఎక్కడికైనా మృత్యువొస్తుంది కదా

నీ గుండెల పునాదుల్ని చీల్చే
విషాద ప్రకంపనాల్ని తట్టుకుని
ఎవరికోసమో కాదు నీ కోసమే
నువ్వు శిథసెత్తక తప్పదు
ఈ నేల మీదే నీ బతుకుని
మొదలంటా పాతుకోక తప్పదు
దేశం నుంచీ విదేశాల నుంచీ
కురిసే సానుభూతి పవనాల 'మూట' అలా ఉంచి
నువ్వు నీ చేతుల మీదే నిలబడక తప్పదు
ఈ నేల మీదే నీ ఊపిరి కిరణాల్ని ప్రసరించుకోక తప్పదు

మేం మాకు తోచినంత సాయం చేయగలం గానీ
మన్ను తెంపేసిన నీ కుటుంబం రెక్కల్ని

అతిక్రమించలేం గదా
మేం మాకొచ్చినన్ని ఓదార్పు మాటలు చెప్పగలం గానీ
మన్ను మిగల్చిన విషాద అనుభవాల ఛాయల్ని
తుడిచేయలేం గదా
కూలిన ఇళ్ళనైతే నిర్మించగలం గానీ
రాలిన దేహాల్ని నిర్మించలేం గదా
ఈ మన్ను సాక్షిగా మరోసారి చెబుతున్నా
నీకు నువ్వే పనిముట్టువై
నీ జీవిత అధ్యాయాల్ని నువ్వే పునర్లిఖించుకోవాలి
మళ్ళీ నువ్వు వ్యవసాయం చేయాలి
మళ్ళీ నువ్వు పరిశ్రమలు నడపాలి
నేల మీద నమ్మకంతో
మళ్ళీ నువ్వు నిశ్చింతగా నిద్రపోవాలి

వార్తల్ని చదివో చూసో
దుఃఖించడం మాత్రమే తెలిసిన మేమాశ్చర్యపోయే విధంగా
ఈ సానుభూతి వాక్యాల్నీ ఈ ఓదార్పు మాటల్నీ
ఈ వేదాంత ప్రవచనాల్నీ బద్దలు కొట్టుకుని
శిథిలాల అడుగు నుంచి
ఓ తాజ్‌లానో ఓ చార్మినార్‌లానో
మరో అజంతా ఎల్లోరా గుహల్లానో
నువ్వు నిర్మాణమవ్వడమే
నేను ఎదురుచూస్తున్న సరిగొప్ప దృశ్యం
(లాతూర్ భూకంప బాధితుల కోసం)

# పెట్రోలు బాయ్



ఎంత అద్భుతం ఎంత ఆశ్చర్యం ఎంత ఆనందం
శాస్త్రం చదువుకోని సంచలన శాస్త్రవేత్తా
మన దేశం గర్భాన ప్రవహించే పెట్రోలు పాయవు గదూ

• • • • • • • • • • • • •

నువ్వు సామ్రాజ్యవాద దేశాల విత్తువీ కావు
వీటో నాటో రాజ్యాల వారసుడివీ కావు
ఉత్త ఇండియన్‌వి
స్వదేశీ అభిమానం లేని అసూయా కాటరాక్ట్ పొరల్లోంచి
నీ పేరునెలా పలకగలం
అవినీతి కమ్ముడుపోయిన మా పనితనాల క్షేత్రం మీద
నీ బొమ్మనెలా నిలబెట్టగలం
ఏ ధనిక దేశమో నువ్వు వలసపోయినప్పుడు - అప్పుడు
కాక అరిన మా గుండెల దప్పులపై
నువ్వు మా వాడివేనని వాయించుకుంటాములే
ఈ దేశపు అలెగ్జాండరు ఫ్లెమింగూ
పుట్టిన నేలను మరవకు తంబీ

• • • • • • • • • • • • •

ఎన్ని ఆటంకాలు నీ ప్రాణాల్ని దూస్తాయో
నీ దేశవాళీ ప్రయోగశాలనే కాదు
నీ పరిశోధనా కృషిని యావత్తూ తగలబెట్టు యత్నాలుంటాయి
మెతుకు మీద గాట్లు పెట్టే వ్యాపార ఒప్పందాల సంకెళ్ళుంటాయి
బతుకు అందంపై కన్నేసిన బహుళ జాతి సంస్థల మాయలుంటాయి
రు పాయి చేప పాపాయిలను మింగే డాలర్ షార్కులుంటాయి
నా దేశపు నోబుల్ బహుమతీ

ఎన్ని ఆటంకాలు నీకు వలలేస్తాయో

• • • • • • • • • • • • • •

ఇప్పుడు మనం నోరు పెగల్చి మాట్లాడకపోతే - ఎవడో
మన స్వరపేటికలపై కూడా పేటెంట్ హక్కు ప్రకటిస్తాడు
ఇప్పుడు మనం కలం విదిల్చి రాయకపోతే - ఎవడో
మన ఆధునిక జీవన రచనపై నిషేధం విధిస్తాడు
ఇప్పుడు మనం మేను విరిచి మేల్కొనకపోతే - ఎవడో
మన కలల కళావేదిక తెరలపై తన పేరు చెక్కుకుంటాడు

• • • • • • • • • • • • • •

నేనో కలగంటున్నాను
రానున్న దశాబ్దాలూ శతాబ్దాలూ మనవేనని కలగంటున్నాను
ప్రపంచ బ్యాంకు దివాలా తీసి
మన చుట్టూ తిరుగుతున్నట్టు కలగంటున్నాను
సామ్రాజ్యవాద శక్తుల పెత్తనాల కర్రలు
చివికిపోతున్నట్టు కలగంటున్నాను
అగ్రరాజ్య దురహంకారాల కోటలు
ఫెళఫెళా కూలిపోతున్నట్టు కలగంటున్నాను
ఆ కలకు వైశాల్యమూ చుట్టుకొలతా ఘనపరిమాణమూ అన్నీ నువ్వే

• • • • • • • • • • • • • •

వర్షానంతర నీలాకాశంలా స్వచ్ఛ స్వచ్ఛంగా
వందేమాతర గీతాలాపన సమయంలా వినమ్ర వినమ్రంగా
సమస్త విజ్ఞాన శాస్త్రాల్నీ చాపలా పరిచి
సాష్టాంగ ప్రణామం చేయడమే నీకు నా గౌరవ పురస్కారం
నువ్వీ దేశంలో పుట్టిన గుర్తుగా రామరూ
నా కవితను నీకు అంకిత మిచ్చుకుంటాను

తేలేత కరాల కంకణాల నిక్వణాల మీద మోజు గానీ
దైవంతో మనకు పనేంటి?
నాజూకు చరణాల నూపురాల నిస్వనాల మీద దృష్టిగానీ
అర్చకుని మంత్రోచ్చారణా గోల మనకెందుకు !
అసభ్య కూనిరాగాలాపన చేస్తూ అందాల్ని ఆఘ్రాణిద్దాం
జారు పైటల రెపరెపలనూ
పట్టు చీరల పరపరలనూ
కామ జీరలల్లుకున్న కళ్ళారా జుర్రేద్దాం
స్తంభాల మీది బొమ్మల విన్యాసాల ముందు మోకరిల్లుదాం
రా బావా గుళ్ళోకెడదాం ! -
వరుస తీరిన వయ్యారాల్ని
ముందు నుంచీ వెనుక నుంచీ
పరికించి పరికించి వికారంతో వంకర్లు పోదాం
జడకుచ్చులు తగిలో చీరచెంగులు తాకో
పులకించి పులకించి పిచ్చెక్కి గింగిరాలు తిరుగుదాం
ప్రదక్షిణలు చేస్తున్నప్పుడు కూడా కూడా పడి - పళ్ళు
ఇకిలించి ఇకిలించి దొంగ కార్చుకుందాం
మూర్ఛరోగిలా తపతపా
మనసును శరీరాలతో బాదుకుందాం
రా బావా గుళ్ళోకెడదాం ! -
వాళ్ళల్లో  మన అక్కా లేదూ ఆలీ లేదూ
వాళ్ళల్లో మన చెల్లీ లేదూ తల్లీ లేదూ
వాళ్ళతో మనకు బంధుత్వమూ లేదూ స్నేహమూ లేదూ
గంట కొడుతున్నప్పుడైనా - కించిత్

పైట తొలగుతుందేమోనని దొంగ చూపులు చూద్దాం
కళ్ళెర్ర చేస్తారంటావా - సారీ చెప్పేద్దాం
చెంపలు వాయిస్తారంటావా - నమస్కారం పెట్టేద్దాం
మన సిగ్గును చిముడ్చుకుని
మన బుద్ధిని బూడిద చేసుకుని
నాగరికతకు నవ్యార్థాలు చెబుదాం
అబ్బా - ఇప్పుడు
సంస్కారం సభ్యతల సంగతెందుకు బావా
వాటిని కొబ్బరి చెక్కల కిందో అరటి తొక్కల కిందో
తొక్కేద్దాం
మనకూ అక్క ఉంటుందనీ అమ్మ ఉంటుందనీ
మనకూ ఆలి ఉంటుందనీ అత్త ఉంటుందనీ
మరచిపోయి మరచిపోయి మరచిపోదాం
మన సంస్కృతి మీద మనమే ఉమ్మేసుకుందాం
మనల్ని మనమే ఛీత్కారం చెప్పులతో కొట్టుకుందాం
అటు చూడకు బావా అటు చూడకు
గుడి గుమ్మం ముందే
దీనంగా హీనంగా హేయంగా అసహాయంగా
ఆకలి వల విసురుతూంది బిచ్చగత్తె
మన కంటి కటకాల మీద నల్లని మచ్చ
• • • • • • • • • • • • •
ఓరి బావా నిజం చెప్పనా
మానవ చరిత్ర పుస్తకం పై మనమే
నల్లని ఎర్రని సిరా మరకలం

# కన్నీటి ముసురు

భగ్వాన్
వడ్లబండి 

ప్రాణం నిండా పల్లె
కొత్త ధాన్యం సువాసనలు ధరిస్తున్న ఋతువులో
నేల నేలంతా నీటినీనినట్లు
ముసురు ముసుగుతో మృత్యువులా నువ్వొచ్చావు
నిండు గర్భిణీ చేలు కుప్పకూలిపోయాయి
అరబెట్టిన పనలు తెప్పల్లా తేలాయి
కళ్ళంలోని గింజలు కళ్ళంలోనే మట్టి కారుతున్నాయి
వర్షమా ! . . . వర్షమా ! .
సేద్య వీరుని బతుకు మీద
నీటి పోటు పొడవడం నీకు మర్యాదా?
చేనూ రైతూ సంభాషించుకునే సుందర దృశ్యాలన్నిటినీ
భోరున మింగేసిన నీటి చిలువా
రైతును చూసావా ? !
వజ్రంలా మెరవాల్సిన వాడి చూపు
వ్రణంలా చితికిపోయింది
పసిడి గాదెలా పరిమళించాల్సిన వాడి మాట
బురదలా జారిపోయింది
వాడి భుజం మీంచి భరోసా పావురం ఎగిరిపోయింది
వాడి పెదవి దీపం ఫిలమెంటు రాలిపోయింది
వాడి తలగుడ్డ తడిసి పెట్టుబడంత బరువైంది
చేతికొచ్చే పంటపోయి
చేతికందిన కొడుకు పోయినట్టు
చేయీ కాలూ ఆడక వాడు శూన్యగ్రస్తుడయ్యాడు
తెగులు బెడదకూ దళారి మాయకూ
తలవంచని అపార అనుభవమున్నా

డంకెల్ కుతంత్రాన్ని ఎదిరించగల
ఐక్య పోరాట పటిమ ఉన్నా
ఒక్క నీ నమ్మక ద్రోహం ముందే
చేతులెత్తేసి మోకరిల్లుతున్నాడు
నువ్వు ముంచుకొచ్చినప్పటి ముందు రోజు వరకూ
పంటను చూసి, కళ్ళు
కంకుల మీద గిరికీలు కొట్టే
బంగారు పిచ్చుక రెక్కల్లా మెరిసేవి
గుండె, ఎలపటెద్దు మెడపట్టీ మువ్వలా మోగేది
అప్పుల కుంపట్లారినట్టూ
వాయిదా పడిన పనులన్నీ జరిగినట్టూ
ఊహలు, మనసారా నవ్వినప్పటి
ఇల్లాలి పలువరసలా విచ్చుకునేవి
కసితోనో అక్కసుతోనో రైతురాజ్యం దురాక్రమణ చేస్తూ
నీటి దండులా దండెత్తి నువ్వొచ్చావు అంతే
నిజానికి చెరువయ్యింది వరిచేను కాదు రైతు గుండె
నిజానికి వాలిపోయింది వరివెన్ను కాదు రైతు వెన్ను
స్వేదంతో తడిసి పులకించిన దారికి గండిపడి
నీటి అడుగున కుళ్ళిన గడ్డిలా మిగిలిన జీవితం
ఒక శాప సముద్రంలా రైతును గేలి చేసింది
నీ క్రౌర్య ధారలతో జీవనసారం కొట్టుకుపోయి
రైతు వికలాంగుడయ్యాకా
దేశం వెన్నెముక విరిగాకా
నీకెవరు కైమోడ్పులు చేస్తారు?
వరి రైతు మరో పత్తి రైతు కాకూడదనే
నా ఆశను మాత్రం పొల్లు పోనీకు

13-11-93



ఆంధ్రజ్యోతి వారపత్రిక 7-1-94

నా చుట్టూ ఒక పాటల మబ్బు ఆవరించి ఉంది
తొలుత మంద్రస్థాయి తుంపరలో తడిసి తడిసి
పిదప మధ్యమస్థాయి వానలో మునిగి మునిగి
చివరకు తారాస్థాయి వర్షంలో కొట్టుకుపోతాను
మూడు నిమిషాల తర్వాత రాగధార వెలిసిపోయినా
తడిసిన నేను మాత్రం ఎప్పటికో ఆరేది -

• • • • • • • • • • • • •

అగరువత్తి - ధూమం
హార్మోనియం - స్వరం
కంటి కటకం - నాభ్యంతరం
రక్తం - హిమోగ్లోబిన్
వడ్లగింజ - జీవశక్తి
నేనూ - ఘంటసాల పాట

• • • • • • • • • • • • •

గుండె తీగలలో ప్రవహిస్తున్నంతసేపూ అతని పాట
నా శరీర మైదానాన్ని
పచ్చిక భూమిలా పులకరింప చేస్తున్న అనుభూతి
నా ఇంటి కప్పుమీద
పెరటి చెట్టు నీడలా పరచుకుంటున్న భావన
నా చూపుల కిరణాలు పోగుపడి
మనిషి బొమ్మగా అమరిపోతున్న అవగాహన
పనుల ఒత్తిడికి అలసిన నన్ను
మా పాపాయి నవ్వులా సేద తీరుస్తున్న అనుభవం

• • • • • • • • • • • • •

ఊహకు పరిమళాన్నద్దే అతని పాటకు
వసంతాలెన్నని చెప్పగలం . . .

హృదయానికి స్పందన నేర్పే ఈ పాటను
కొలిచే ప్రమాణాలేవి
మనిషిని తన్మయత్వపు అక్వేరియంలో
ఈదులాడించే ఈ పాటకు
సరిహద్దులనెలా నిర్ణయించేది

• • • • • • • • • • • •

పుప్పొడి స్వరాల కద్దుకుని
రాగాలకు రెక్కలు తొడుక్కుని
ఎగిరొచ్చి నన్ను
తాదాత్మ్యపు అంచున నిలబెట్టే ఈ పాట
నా మెదడు కంప్యూటర్ తెరపై
అమర గాయకుడు పెట్టిన గొప్ప ఆటోగ్రాఫ్

# ప్రాణావరణం



ఈ మూడూ ఎంత గొప్పవి
నేలా
నీరూ
గాలీ
నేల మీద ఒక కాలూ
నీటి మీద ఒక కాలూ
ఉంచి
తల మీద గాలి కిరీటం మోస్తున్నాను
స్వచ్ఛత చుట్టూ దుమ్ము పేర్చుతున్న దుండగుడా
నన్ను చంపకు
నువ్వు చావకు
నీకూ నాకూ
పిడికెడు ప్రాణమే అవసరం
ప్రాణానికి తెగించైనా కాలుష్యంతో యుద్ధం చేసి
ప్రాణాన్ని రక్షించుకుంటాను

8-7-95

# నేపథ్యం

సరిగ్గా అప్పుడే సరిహద్దులన్నీ చెరిగిపోతాయి
ముసురుకున్న నీలి నీడలన్నీ వీడిపోతాయి
మనిషికీ మానవత్వానికీ నడుమ దూరం ఇట్టే తేలిపోతుంది
మొన్న నిన్నటి అనుభవాల్నీ జ్ఞాపకాల్నీ వడబోసి
ఒకే రాగంగా భవిష్యత్తు పాటను నిర్మించుకుంటూ
ఒక బతుకు విధానం బలపడుతుంది
ఇన్నాళ్ళ రకరకాల మరుగుజ్జుతనాలన్నీ కొట్టుకుపోయి
కనుకొలకుల్లోంచి జారే బిందువు కేంద్రంగా
ఒక నిర్ణయం స్థిరపడుతుంది
వేల వేల నిస్సత్తువాణువులు బద్ధలై
జీవితానికో ఆకారాన్ని రచిస్తాయి
మాటల్లోని జీవ పదార్థాన్ని భుజించే వైరస్‌లు
మామూలు కళ్ళకే పట్టుబడతాయి
ఎవరు ఎందుకు చీమలకు చక్కెర చల్లుతున్నారో
ఎవరు ఎందుకు పావురాలకు నూకలు విసురుతున్నారో
టీకా తాత్పర్యాల అవసరం లేకుండానే అవగతమవుతుంది
నుసిని మాత్రమే మిగుల్చుకున్న యాష్ ట్రే బ్రతుకులికనుంచీ
కరెంటు ఉండగానే బ్యాటరీలైట్లు సిద్ధం చేసుకుంటాయి
అనుభూతుల వారబోతల మీదుగా ప్రయాణం సాగిపోతుంది
బాధ రేగడం కూడా అనేక రకాలుగా మంచిదే సుమా
గొంగళి గూట్లోంచి సీతాకోక చిలుక ఎగిరినట్టు
సమాధిలోంచి స్వప్నం వేయి వెలుగుల శిఖలతో పరిమళిస్తుంది
ప్రాణం మానం కళ్ళూ కాళ్ళూ వేళ్ళూ నోళ్ళూ
అన్నీ కొత్తబట్టల్ని తొడుక్కుంటాయి
ఇప్పటి బాధే రేపటి సుఖజీవన పర్వానికి నేపథ్యమవుతుంది

# మూర్ఛిల్లిన ప్రశ్న



పింఛనూ రాదు ప్రాణమూ పోదు
భేతాళ కథ చివరి సశేషంలా సమస్య సలుపుతూనే ఉంది
ఉద్యోగ విరమణంటే
శరీరమూ స్పర్శా విడిపోవడమేనని తెలిపోయాకా
ఎఱ్ఱ టేపుల పీట ముడుల ఉరుల్లో ఊపిరి సలపక నేను -
గిలకరించిన గులకరాళ్ళ చప్పుళ్ళుగా హృదయ స్పందనలూ
విస్తరించిన నాచు పుట్టల సరస్సు అలల్లా కళ్ళ కలలూ
ఒక సుదీర్ఘ అవిశ్రాంత సేవకు ఫలితంగా మిగిలిపోయాకా
పాములు తప్ప నిచ్చెనలు లేని ఆటలో పావులా నేను -
ఇంటి ఆనందాల మీదా అవసరాల మీదా అశ్రద్ధ మూత పెట్టి
'డ్యూటీ ఈజ్ గాడ్' గా కాలమూ రక్తమూ అంకితమిచ్చి
ఆఫీసులోనే నా బతుకు ఫొటో వ్రేలాడదీసుకున్న పుణ్యానికి
చిత్తుబుట్టలోని కాగితం ఉండల నడుమ
నా నవ్వును వెతుక్కుంటూ నేను -
రిటైరై ఏళ్ళైనా పెన్షనెందుకు రాదో ఎవ్వరూ పట్టించుకోరు
ఇదొక అనాథ ప్రపంచం
ఎన్నెన్నో సంశయాల మధ్య సమస్యకు సమాధానం దొరకదు
తోటి ఉద్యోగులే తోడు దొంగలైన వేళ
కూలుతున్న భరోసా శిఖరం కింద నేను -
ఆఫీసు మెట్లు ఎక్కీ దిగీ
రాని చిరునవ్వులు పెదాల చివరల మోసీ మోసీ
సంఘనాయకులనూ ప్రజా ప్రతినిధులనూ వేడీ వేడీ
బ్యూరోక్రసీ గిట్టల నాడాల కింద నలిగీ నలిగీ
ముసలితనపు సుఖజీవన తైలాన్ని

చిల్లు చెంబులో పోసుకున్నట్టయింది
తాతయ్యా అన్న మనవడి పిలుపుకి
పులకరింత పొందనూ లేక
'నువ్వో అసమర్థుడి' వన్నట్టు చూసే
కొడుకు ముందు తల ఎత్తనూ లేక
ఆత్రంగా ఎదురొచ్చినా 'మళ్ళీ మామూలేనా' అన్న
భార్య మౌనప్రశ్నకు జవాబివ్వనూ లేక
కోడిగుడ్డు డొల్లలాంటి గుండెతో నేను -
నిర్లక్ష్యాన్ని పీకలవరకూ తాగి నిద్రపోతున్న నేరం వాళ్ళది
అశ్రుక్లిన్న దృక్కుల సంక్షుభిత స్వగతాల శిక్ష మాత్రం నాకు
మనిషితనం యావత్తూ రూపాయి మూర్ఛబిళ్ళ మెడలో కట్టుకుని
వీధిన పడి కాళ్ళూ చేతులూ కొట్టుకుంటోంది
అవినీతి మట్టం వ్యవస్థ అంచులు దాటి ప్రవహిస్తోంది
దుమ్ము పట్టిన ఫైలు కాగితాల నడుమ
అచ్చు పడిన కీటకపు కళేబరంలా నేను -
నా శవం చుట్టూ పైసలేరుకుంటూ వాళ్ళు
ఇక అడగలేను ఇక తిరగలేను ఇక అర్జీలు పెట్టలేను
ముడుతలూ పడ్డ శరీరానికి
ఇంకా ఎక్స్‌పైరీ డేట్ దాటని ఆశాలేపనాన్ని పూస్తూ
తరిమే మృత్యువుని
పింఛనొచ్చే వరకైనా ఆగమని కోరుతూ
కదలని కాలపత్రంపై మూర్ఛిల్లిన శేషప్రశ్నలా నేను -

# గాయపడ్డ నైటింగేల్

కన్యాత్వమే ప్రవేశార్హతగా
నాలుగ్గోడల గదిలో అవమానకాండ జరిగిపోయింది
ఖచ్చితంగా ఆ క్షణాల్లో
సేవావృత్తి శిక్షణా తరగతి పాఠ్యపుస్తకం మొదటి పేజీ
సర్రున చిరిగుంటుంది
సమర్థించే వాడ్ని ఓ ప్రశ్న అడగాలనుంది
వృత్తికి రాకముందు మీరెప్పుడైనా
మీ మీ బ్రహ్మచర్యాలను తడిమి చూసుకున్నారా .
అనుభవించిన వాళ్ళగ్గానీ బాధ అర్థం కాదు
సిరంజి సూది దిగింది జబ్బమీదో పిరుదు మీదో కాదు
ఆత్మ విశ్వాసం మీద వృత్తి ధర్మం మీద
కన్యాత్వ పరీక్ష వార్త వినగానే
రేపటి శతాబ్దపు ప్రవేశ ద్వారం వద్ద
ఆదిమానవుడు గంతులేస్తూ కనిపించాడు . .
ఇంత దారుణం జరిగినా ఇంకా
నైటింగేల్ చిత్రంలోని లాంతరు నేల పడి
భగ్గున మండుండక పోవచ్చు
నోటి మీద వేలేసుకున్న 'ష్ స్ స్ స్ .' ఫొటో అద్దం
భళ్ళున పగిలుండక పోవచ్చు
యూనీఫామ్ కుట్టే దర్జీ బొటన వేలు కత్తెరలో పడి
కస్సున తెగుండకపోవచ్చు
ఆసుపత్రి గేటుమీద దీపం ఫిలమెంటు
టప్పున రాలుండక పోవచ్చు
• • • • • • • • • • • • •
జ్వరమాని నోట్లో పెట్టి ధైర్యం చెబుతూ

నుదుటి మీద చెయ్యేసి మానసిక గాయాల్ని దులుపుతూ
ఒకే ఒక్క తియ్యని చిరునవ్వు పలకరింపుతో
జారిపోతున్న జవసత్వాల కొమ్మను చిగురింప చేస్తూ
ఆసుపత్రిలో ఆరోగ్యబాణీలాలపించే గంధర్వకాంత ఆమె
ఆ మహోన్నత సేవా స్త్రీ మూర్తి వారసుల
సిగ్గుమీదా అభిమానం మీదా కఫన్‌ని కప్పారు . . .
వార్డుల్లో నీ వెనుక నడుస్తున్నంత సేపూ
నువ్వు సూది గుచ్చిన చోట దూదితో తుడుస్తున్నంత సేపూ
నువ్వు కెలికి వదిలేసిన గాయాల్ని కడుగుతున్నంతసేపూ
ఆమె కన్యాత్వం మీద నీ అనుమానపు పరీక్ష
చీము కంపు కొడుతూనే ఉంటుంది
రోగి గుండె చప్పుడుకు బదులు స్టెతస్కోపులో
రూపాయి మాంత్రికుని వికటాట్టహాసాల్ని ఆరాధించేవాడు
వ్యాపార ప్రమాణాలతోనే అందరి జీవితాల్నీ కొలుస్తాడు
తెల్లని దుస్తులు వేసుకున్నా నీడ నల్లగానే ఉంటుందని
ఈ సారి కూడా ఋజువయ్యింది

# నది ఎవరిది? . . . . . .

భగ్వాన్
వడ్లబండి



జల తరంగిణీ నిస్వనం ఆకలి అరుపెక్కక ముందే
జల జీవాణువు ఇసుక రేణువుగా ఆకృతించక ముందే
నది కటూ ఇటూ గుబాళించిన
నాగరికతా దృశ్యం ధ్వంసం కాకముందే
పరిష్కారం కావాలి -
సమస్యా వేదిక మీద నామోషీ లొద్దు నటనలూ వద్దు
సమస్యా సాధన వేళ ప్రవచనాలూ ప్రహసనాలూ పనికిరావు
చందన వృక్షమా
నీ పరిమళం మించి స్వార్థక్రిముల నెగరనీకు
నీతో కలసి నేనూ నదిలో బతుకు పడవ నడుపుకోవాలి
చల్లని లవణ స్పర్శతో మా నేలను బతికించే నీటిని
జహ్ను మునిలా నువ్వు అపోసన పడితే
నందికొండా, మా ఆనకట్టలేం గాను
జోగ్ జలపాతమా, మా భారీ విద్యుత్ ప్రాజెక్టుల సంగతేమిటి
గోమఠేశ్వరా, మా భూమిపై పరచుకున్న ఆకుపచ్చ అవసరాలేమవుతాయి
నువ్వు దోచుకో చూసేది నదీ జలం మాత్రమే కాదు
మా శరీరాల తడి మా పంట పొలాల చెమ్మ
మా జీవన కాంక్షా మకరంద మహత్వధార
కర్నాటకమా
నీ సంగీతంలో అపశ్రుతులు మోగనీకు
నీతో కలసి నేనూ జీవన కీర్తన పాడుకోవాలి
నది ఎగువన జీవించే నీవు అన్నావైనప్పుడు
నది చివరన బతికే నేను తమ్ముడ్ని కానా .
కృష్ణ జలం తాగి కళ్యాణ రాగం పాడుకునే వాడికి

రెండు చేతులూ పైకెత్తి
మేఘరంజని నాలపించే దుస్థితి రానీకు మిత్రమా
బృందావనమా
నీ గుండె పొద కీచురాళ్ళ నిలయం కానీకు
నీతో కలసి నేనూ జీవిత సోయగాల్ని అనుభవించాలి
కోలారు బంగారమా నది ఒక్కరి సొత్తు కాదు
రెండు భాషల నడుమ తేడాను
రెండు మనసుల మధ్య వైరంగా ముదరనీకు
ప్రేమ సంపదా మనసు సువాసనా స్నేహ కాంతీ
ఒకరితో ఒకరు పంచుకుందాం చేయి చాపు
ఎత్తు పెరుగుతున్న ఆనకట్ట కవతల నీరూ ఇవతల ఇసుకా
ఎటు దూకితే మరణం రాదో చెప్పగలవా కన్నడమా

# యాంత్రికం

రోజూలాగే ఆడయంత్రం కళ్ళు నులుపుకుంటూ లేచింది
రోజూలాగే వాకిలి తుడిచి అంట్లు తోమి స్నానం చేసి
రోజూలాగే వంట మనిషి వేషం వేసింది
రోజూలాగే మగయంత్రం బద్ధకంగా మంచం దిగాడు
రోజూలాగే పంపునీళ్ళు పట్టి గెడ్డం గీసి స్కూటరు తుడిచి
రోజూలాగే పగటి వేషం వేసాడు
రోజూలాగే అమ్మ అరుపులకూ నాన్న కేకలకూ
రోజూలాగే పిల్ల యంత్రాలు రెండూ లేవలేక లేచాయి
రోజూలాగే కొట్టుకుంటూ తిట్టుకుంటూ అల్లరి చేస్తూ
రోజూలాగే యూనిఫామ్‌లోకి ప్రవేశించి కాన్వెంటు రిక్షా ఎక్కాయి
రోజూలాగే టిఫిన్ బాక్సు సర్దుకుని ఆడయంత్రం సిటీబస్సు ఎక్కింది
రోజూలాగే ఇంటికి తాళం వేసి మగయంత్రం స్కూటరు స్టార్టు చేసాడు
రోజూలాగే సాయంత్రం పిల్లయంత్రాలు రెండూ రిక్షా దిగాయి
రోజూలాగే మూసిన తలుపులు వాళ్ళని వెక్కిరించాయి
రోజూలాగే కాసేపు ఆడుకుని కాసేపు తిట్టుకుని కాసేపు కొట్టుకుని
అరుగెక్కి నీరసించాయి
రోజూలాగే ఉస్సూరంటూ ఆడయంత్రం సిటీబస్సు దిగింది
రోజూలాగే ఇంటికి తాళం తీస్తూ పిల్లయంత్రాల మీద
సాధింపు స్వేదం చిమ్మింది
రోజూలాగే మగయంత్రం విసుక్కుంటూ స్కూటరు దిగాడు
రోజూలాగే ఆఫీసు నుంచి చిరాకు ఫైలు తెచ్చి ఇంట్లో తెరిచాడు
రోజూలాగే నాలుగు రకాల టీవీ ఛానెళ్ళనూ
నాలుగు యంత్రాలూ కళ్ళనిండా తాగాయి
రోజూలాగే పెద్ద యంత్రాలు రెండూ కంచాల ముందు కూర్చున్నాయి

రోజూలాగే   తమ తమ బాసు యంత్రాల్ని కాసేపూ
తమతమ తోటి యంత్రాల్ని కాసేపూ విమర్శించుకున్నాయి
రోజూలాగే   రెప్పలు  వాలిపోతుండగా
నాలుగు యంత్రాలూ నిద్ర మంచాలెక్కాయి
వాళ్ళ మధ్య మాటలు రాలవు - రాలినా
యంత్రాలు కదులుతున్న చప్పుళ్ళే వినిపిస్తాయి
వాళ్ళ మధ్య ప్రేమలు కురవవు - కురిసినా
యంత్రాలు రాసుకుంటున్న శబ్దాలే వినిపిస్తాయి
ఇప్పుడు మనిషి యంత్రం - ఇల్లు యంత్రాగారం
ఎలా నవ్వాలో ఎలా నడవాలో ఎలా మాట్లాడాలో
ఎలా సంసారం చేయాలో
రేపట్నుంచీ కంప్యూటర్లు నేర్పుతాయి

# ఇల్లు

## 1

రేడియోలో సన్నాయి కచేరీ
ఇల్లంతా సందడే సందడి పెళ్ళివారిల్లులా
మా అబ్బాయి చూపూ మా అమ్మాయి నవ్వూ
నా సహచరి పలుకూ
సన్నాయి పాటలైపోయాయి

## 2

మా అబ్బాయి
గాలిపటం ఎగరేస్తున్నాడు
వాడి కళ్ళల్లో ఆకాశమంత గాలిపటం
నాకు వాడే
ఒక గాలిపటంలా గోచరిస్తున్నాడు

## 3

మా పాపాయి
పెంచుకున్న పూలమొక్క పూసింది
సీతాకోకచిలుకలు దాడి చేసాయి
ఆమె కళ్ళల్లోంచి
మకరందం కురిసింది

## 4

మా పిల్లలు
స్నానం చేసి ఉంటారు
ఇల్లంతా తడి పాదాల గుర్తులు
ఇంటికేదో పండగొచ్చింది

# గోదావరి జ్ఞాపకం వస్తే

గోదావరి జ్ఞాపకం వస్తే పడవ జ్ఞాపకం వస్తుంది
పడవ మీంచి గురిచూసే మృత్యువలలు జ్ఞాపకం వస్తాయి
వలకు చిక్కిన జలచరాల ప్రాణభయాలు జ్ఞాపకం వస్తాయి
గోదావరి జ్ఞాపకం వస్తే వరద జ్ఞాపకం వస్తుంది
వరదతో పాటు తుఫాన్లూ ఉప్పెనలూ జ్ఞాపకం వస్తాయి
మునిగిన పంటలూ పెరిగిన ధరలూ జ్ఞాపకం వస్తాయి
గోదావరి జ్ఞాపకం వస్తే వంతెన జ్ఞాపకం వస్తుంది
వంతెన మీంచి దూకే బస్సులు జ్ఞాపకం వస్తాయి
మనుషుల్ని కోల్పోయిన కుటుంబాల రోదనలు జ్ఞాపకం వస్తాయి
గోదావరి జ్ఞాపకం వస్తే కాలువ జ్ఞాపకం వస్తుంది
కాలువ వెంబడి కట్టుకున్న ఇళ్ళు జ్ఞాపకం వస్తాయి
మధ్య తరగతి ఆశల పేకమేడలు జ్ఞాపకం వస్తాయి
గోదావరి జ్ఞాపకం వస్తే అడవి జ్ఞాపకం వస్తుంది
అడవే అమ్మయిన గిరిజన తండాలు జ్ఞాపకం వస్తాయి
దోపిడికి బలవుతున్న అమాయకత్వాలు జ్ఞాపకం వస్తాయి
గోదావరి జ్ఞాపకం వస్తే వరిచేను జ్ఞాపకం వస్తుంది
వరిచేలను పొదుగుకున్న పల్లెలు జ్ఞాపకం వస్తాయి
కులాలుగా పార్టీలుగా ముక్కలైన అజ్ఞానాలు జ్ఞాపకం వస్తాయి
గోదావరి జ్ఞాపకం వస్తే తీరం జ్ఞాపకం వస్తుంది
తీరం వెంట వెలసిన పరిశ్రమలు జ్ఞాపకం వస్తాయి
నింగి నీలినీ నేల పచ్చనూ కబళించే కాలుష్యాలు జ్ఞాపకం వస్తాయి
గోదావరి జ్ఞాపకం వస్తే నగరం జ్ఞాపకం వస్తుంది
నగరాన్ని మింగే పాశ్చాత్య నాగరితా జ్వరాలు జ్ఞాపకం వస్తాయి
అనాథ ఆశ్రమాలూ ఓల్డ్ ఏజ్ హోమ్‌లూ జ్ఞాపకం వస్తాయి

గోదావరి జ్ఞాపకం వస్తే రాజరాజ నరేంద్రుడు జ్ఞాపకం వస్తాడు
చిత్రాంగి సారంగధరుడూ జ్ఞాపకం వస్తారు
అనాదిగా జరుగుతున్న ఏకపక్ష నిర్ణయాల కుట్రలు జ్ఞాపకం వస్తాయి
గోదావరి జ్ఞాపకం వస్తే
కందుకూరి టంగుటూరి జ్ఞాపకం వస్తారు
ఆదికవీ అల్లూరి సీతారామరాజూ జ్ఞాపకం వస్తారు
పినాకపాణీ డొక్కా సీతమ్మా జ్ఞాపకం వస్తారు
దామెర్ల కాటనూ జ్ఞాపకం వస్తారు
గోదావరి జ్ఞాపకం వస్తే
తెలుగు జన జీవన కళల కాంతులన్నీ జ్ఞాపకం వస్తాయి
గోదావరి అలల కదలికల్లో నాకెప్పుడూ
మూడురంగుల నరధనుస్సు కనిపిస్తుంది
ఒకటి ఆకలి రంగు
రెండు దాహం రంగు
మూడోది నివాసం రంగు
రంగుల మూడైనా ప్రవాహ సూత్రం ఒకటే
అది - బతుకు ప్రవాహం

# కోనసీమ

తెలుగు తల్లి గుండెకాయకు చిల్లు పడింది
కొబ్బరి డేరా గాలికి కొట్టుకుపోయింది
ఉప్పెన హరిత వర్ణం ఉసురు తీసింది
ఏమి చెప్పాలి కోనసీమ గురించి
నా హృదయసీమ గురించి
ఒకప్పటి మన స్వర్గసీమ గురించి
ఇవి చెట్లు కూలిన దృశ్యాలు కావు
మనుగడ మేడ మెట్లు కూలిన దృశ్యాలు
ఇవి వరిమళ్ళు కుళ్ళిన దృశ్యాలు కావు
నోటి దగ్గరి మెతుకు కుళ్ళిన దృశ్యాలు
ఇవి మనుష్యులు మరణించిన దృశ్యాలు కావు
రేపు మీద నమ్మకం మరణించిన దృశ్యాలు
అణు విస్ఫోటనానంతరం ఇలాగే ఉందేమో హిరోషిమా
ప్రకృతిని తల్లీ అని పిలవడానికి నోరు రావట్లేదు
ఇక ఏడుపొక్కటే దక్కింది
సముద్రమన్నా తుఫానన్నా భయం ఒక్కటే మిగిలింది
ఇన్నాళ్ళూ కొబ్బరి జలంతో దాహం తీర్చిన కోనసీమ
ఈనాడు కన్నీటితో గొంతు తడుపుకుంటోంది
తీరంలో నిలబడి చూసినప్పుడు
కొబ్బరి బొండాలకు బదులు కుక్కలు చింపిన మొండాలు కనిపిస్తుంటే
చలించని మనిషుంటాడా
దుఃఖించీ దుఃఖించీ దుఃఖించీ
నా ఎడమ రొమ్ములో గుండె లేదు కోనసీమ ఉంది

# వడ్లబండి శబ్దాలు

పుస్తకం అచ్చు వేద్దామన్న ఊహ వచ్చినప్పట్నుంచీ, ముద్రణ పూర్తయ్యే వరకూ తోడునీడగా నిలిచిన కవి మిత్రుడూ, ప్రియమిత్రుడూ భల్లం సూర్యనారాయణ రాజుకు కృతజ్ఞతలు

తమ అమూల్యమైన కాలాన్ని ముఖచిత్ర ముద్రణ విషయంలో నాకోసం ఖర్చుపెట్టిన శ్రీ S.R. పృథ్వీగార్కి కృతజ్ఞతలు

పుస్తకాన్ని అందంగా డిజైన్ చేసిన మిత్రుడు వంశీగ్రాఫిక్స్ నాగేంద్ర శర్మకు కృతజ్ఞతలు

ప్రచురణ పూర్వ విరాళాలిచ్చి పుస్తక ముద్రణ భారాన్ని మోసిన వీరందరికీ కృతజ్ఞతలు

1)టిమ్ ఆంజనేయస్వామి రూ 2000/-, 2)శ్రీమతి A V L నర్సమాంబ, శైలేష్, శశాంక, లంకలకోడేరు, రూ 3085/- 3) శ్రీ A V సుబ్బారావు, ఐడియల్ కాన్వెంట్, జిన్నూరు, రూ 500/- 4) శ్రీ V. త్రిమూర్తులు, శ్రీమతి G V.K R. సత్యనారాయణమ్మ, టీచరు, లంకలకోడేరు, రూ 300/- 5)శ్రీ P సీతారామరాజు, శ్రీమతి V రామసీత, టీచర్లు, లంకలకోడేరు, రూ 300/- 6) శ్రీ పెన్మెత్స బలరామరాజు, రిటైర్డు టీచరు, లంకలకోడేరు, రూ 300/-, 7) శ్రీ జి శ్రీనివాసు, టీచరు, వెదుళ్ళపాలెం రూ 200/- 8)శ్రీ M. బెన్నెట్, టీచరు, ఆగర్రు, రూ 200/-, 9) శ్రీ N S ప్రకాశరావు, టీచరు, లంకలకోడేరు రూ 200/- 10) శ్రీ K నాగేశ్వరరావు, టీచరు, లంకలకోడేరు, రూ 116/- 11)శ్రీ G T. వెంకట కుమార్, టీచరు, కమ్మ రూ 116/- 12)శ్రీ I M V గోపాలరాజు, టీచరు, కాపవరం, రూ 116/- 13)శ్రీ K.V నరశింహరాజు, హైస్కూలు, లంకలకోడేరు రూ 250/- 14)శ్రీ P సూర్యనారాయణరాజు, లాబ్ అసిస్టెంటు, లంకలకోడేరు రూ 116/- 15)శ్రీ Ch రామారావు, టీచరు, లంకలకోడేరు రూ 116/- 16)శ్రీ K జాన్‌రత్నం, టీచరు, లంకలకోడేరు, రూ 116/-, 17)శ్రీ Ch లక్ష్మణరావు, టీచరు, జిన్నూరు రూ 116/-, 18) శ్రీ M. మురళీకృష్ణ, L.I C. ఏజంటు, పాలకొల్లు, రూ 116/-, 19) శ్రీ S V.T. వరప్రసాదరాజు, మెడికల్ షాపు, లంకలకోడేరు, రూ 116/-, 20) శ్రీ S L నరశింహరాజు, టీచరు, లంకలకోడేరు ,రూ 116/-, 21)శ్రీ G.S.L V.R V సుబ్బరాజు, టీచరు, లంకలకోడేరు, రూ 100/- 22)శ్రీ Ch V సుబ్బారావు, టీచరు, లంకలకోడేరు రూ 100/-, 23)శ్రీ M V. కృష్ణారావు, టీచరు, లంకలకోడేరు, రూ. 100/-, 24) శ్రీ K A.P శర్మ, టీచరు, లంకలకోడేరు, రూ 100/-, 25) శ్రీ K N.V రామ ప్రసాదు, టీచరు, పాలకొల్లు రూ 100/-, 26)

శ్రీ K సూర్యచంద్రరావు, టీచరు, లంకలకోడేరు, రూ 100/- 27)శ్రీ వేగొండి రంగారావు, L.I.C ఏజంట్, పాలకొల్లు, రూ 100/- 28)శ్రీ K హనుమాన్ రెడ్డి పాలకొల్లు, రూ 100/- 29)శ్రీమతి గోటేటి రాదాసుందరి, టీచరు, లంకలకోడేరు, రూ 100/- 30)శ్రీ K J జైసింగ్, టీచరు, తిల్లపూడి, రూ 100/- 31) శ్రీ K ఆంజనేయరాజు, టీచరు, అరట్లకట్ట, రూ 100/- 32) శ్రీ ఎ విజయసారథి, టీచరు, S చిక్కాల, రూ 100/-, 33)శ్రీ V రత్నకుమార్, టీచరు, పాలకొల్లు రూ 100/- 34)శ్రీ M V మురళీ రంగారావు, టీచరు, ఆగర్రు, రూ 100/- 35) శ్రీ షేక్ షమీా ఉల్లా, టీచరు, కాపవరం, రూ 100/- 36)శ్రీ స్వామి, అర్బన్ బ్యాంక్ పాలకొల్లు, రూ 100/- 37)శ్రీ P సత్యనారాయణరాజు, టీచరు, ఆగర్రు, రూ 100/- 38)శ్రీ M R.V సత్యనారాయణ మూర్తి, రమ్యసాహితి, పెనుగొండ, రూ 100/- 39)శ్రీ అత్తిలి వీర్రాజు, గాయత్రీ ప్రెస్, పాలకొల్లు, రూ 60/-, 40) శ్రీ G V S సుబ్రహ్మణ్యం, టీచరు, పెనుగొండ, రూ 60/- శ్రీV సోమరాజు, టీచరు లంకలకోడేరు, రూ 60/- 41)శ్రీ మహమ్మద్ భాషా, టీచరు, పెదగరువు, రూ 58/- 43)శ్రీT భవరయ్య, టీచరు, లంకలకోడేరు, రూ 58/- 44)శ్రీN T. భాస్కరాచార్యులు, రిటైర్డు టీచరు, అరట్లకట్ట, రూ 58/- 45)శ్రీ A గోపాలకృష్ణ, టీచరు రాయకుదురు, రూ 50/- 46)శ్రీ V V తిరుపతిరాజు, టీచరు, చింతపర్రు రూ 50/- 47) శ్రీN V. కుమారస్వామి, టీచరు, లంకలకోడేరు, చినపేట, రూ 50/- 48)శ్రీ S.K నాగమల్లయ్య, టీచరు, భగ్గేశ్వరం, రూ 50/- 49)శ్రీ M సత్యనారాయణరాజు, రిటైర్డు టీచరు, అరట్లకట్ట, రూ 50/- 50)శ్రీ D J అశ్వనీ కుమార్ రాజు, టీచరు, వడ్లవానిపాలెం, రూ 50/- 51)శ్రీ జి భాస్కరరావు, టీచరు, లంకలకోడేరు, రూ 50/- 52)శ్రీమతి టి స్వర్ణలత, టీచరు, లంకలకోడేరు, రూ 50/- 53) శ్రీ R రామారావు, టీచరు, వడ్లవానిపాలెం, రూ 50/- 54)శ్రీK V P వర్మ, టీచరు, పూలపల్లి, రూ 50/- 55)శ్రీ N D.V ప్రసాద్‌బాబు, టీచరు, లయన్స్ నగర్, రూ 50/- ు)శ్రీ P రామకృష్ణంరాజు, టీచరు, లంకలకోడేరు, రూ 50/- 57)శ్రీN S.S K భాస్కర్, మార్టేరు, రూ 150/- 58)శ్రీ K ఇమ్మానియేలు, టీచరు, పాలకొల్లు, 59)శ్రీ బి వెంకటేశ్వరరావు, టీచరు, లంకలకోడేరు రూ 100/- 60)శ్రీ P సత్యనారాయణమూర్తి, టీచరు, లంకలకోడేరు, రూ 116/- 61) శ్రీ B వెంకటనారాయణ, టీచరు, అరట్లకట్ట రూ 50/- 62) శ్రీ గౌతమి జూనియర్ కాలేజి, పూలపల్లి రూ 500/- 63) శ్రీ ఆర్ రామకృష్ణంరాజు, మెడికల్ షాపు, లంకల కోడేరు రూ 100/- 64) శ్రీ డి జి వి కె విరల్, హైస్కూలు హెడ్ మాస్టర్, జిన్నూరు, రూ 100/- 65) శ్రీ డి వి సత్యనారాయణ రాజు, రిటైర్డు టీచరు, ఎస్ చిక్కాల, రూ 50/-

నా తండ్రిగారు శ్రీ అయినపర్తి శ్రీహరిరావు, పంజావేమవరం, రూ 2000/-



కరవాలానికి
జీవితాన్ని అతికించుకున్న వాడికి చెప్ప
కరచాలనం విలువైందని
రెండు ఆత్మీయతా దృక్కులు పెనవేసుకున్న
క్షణం విలువైందని
తుపాకీ
భుజం మీద ధరించుకున్న వాడికి చెప్ప
ఊపిరి విలువైందని
పలుహృదయాల్ని ఉత్తేజపరిచే
ఒక చిన్ని నవ్వు విలువైందని
అహం
కిరీటాన్ని ధరించిన మగ మహారాజుకు చెప్ప
మమత విలువైందని
రెండు అమృత స్పర్శల నడుమ పూచిన
అనుబంధం విలువైందని
మనిషిని
రూపాయితో తూచేవాడికి చెప్ప
మానవత్వం విలువైందని
మనిషినీ మనిషినీ కలిపే
ఒక అచంచల విశ్వాసం విలువైందని

— భగ్వాన్